# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఆహ్హా ! ఈ వారం ముఖచిత్రం ఎంత ఆవేదనా పూరితముగా నున్నది ! మన ప్రియతమ నాయకుని ముఖము ఎంతయో శాంతముగా నున్నది. ఈ స్వాతంత్ర్య దినానికి మన చాచా నెహ్రూ లేరు. కాని ఆయన జ్ఞాపకార్థముగా స్వాతంత్ర్య దినమున మన కలకల లాడే బాల బాలికలు భారత పౌరులు ఉన్నారు.

ముఖచిత్ర రచన శ్రీ బాపుగారుంయిలా చిత్రించుటఎంతయో ముదావహము. కలకలలాడే ఆయన ముఖము, ఆతని ముందు ప్రియతమ నాయకునికి ప్రియమైన ఎర్ర గులాబీలతో ముఖ చిత్రం చాలా బాగుంది. చిత్ర రచన చేసిన బాపూ గారికి మీకు ఇవే నా అభినందనములు.

యరసడిపాటి ఆనందకుమారి (కావలి)

* * *

మన ఆంధ్రసచిత్ర వారపత్రిక ఇంత చక్కటి ముఖచిత్రంతో వెలువడడం అందరికీ చాలా ఆనందం కలిగించింది. ఇంత అందమైన ముఖచిత్రాన్ని 'పత్రిక' ధరించడం ఇదే మొదటిసారి అని మా నమ్మకం.

పోకల కృపాసాగర్, పోకల చంచల పద్మశేఖర్ (తిరుపతి)

* * *

14—8—64 పత్రిక ముఖచిత్రం చాల ఆకర్షణీయంగా ఉంది. శ్రీ బాపూ గారికి నా ధన్యవాదాలు.

ఎన్. హెచ్. ప్రసాదశర్మ (హైదరాబాద్)

* * *

మందహాసము చేస్తున్నట్లున్న పండిత జవహర్‌లాల్ చిత్రం, ఈ వారం పత్రిక కెంతయో వన్నె తెచ్చింది.

గుండుమళ్ళ వెంకటరామారావు (శ్రీకాకుళం)

* * *

14—8—64 వ తేదీ పత్రికపై, భారత భాగ్య నిర్మాత శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ముఖ చిత్రం, కడు రమ్యంగా చిత్రీకరించబడి, పత్రికకు ఎనలేని శోభను చేకూర్చింది.

బచ్చు వీర్రాజు (ముక్కామల)

* * *

తేది 14—8—64న ప్రచురించిన పత్రికలో కీ. శే. శ్రీ నెహ్రూగారి యొక్క పటములు మరియు ఆతనిపై వ్రాసిన గేయము నాకు చాల నచ్చినది.

ఎ. లక్ష్మి (నిజమాబాద్)

* * *

నేను ప్రతివారము ఆంధ్రసచిత్ర వారపత్రిక తప్పకుండ చదువుతుంటాను. ఈ మధ్య మీ పత్రికలో కథలు, వనితాలోకం వ్యాసాలు చాలా బాగున్నాయి. ప్రతి వారము వారపత్రిక చదువుతుంటే నాకెంతో ఆనందంగా ఉంటుంది. ఒక్క వారము పత్రిక చదువని యెడల ఇంట్లో ఏదో వెలితిగా ఉంటుంది నాకుమట్టుకు.

శ్రీమతి వి. శాంతమ్మ (శోలాపూర్)

## జపాన్ యువకుని కోరిక

'జపాను యువకుని కోరిక'ను గురించి, నా అభిమాన ఆంధ్రసచిత్ర వారపత్రికలో చదివాను. అయితే, ఆ యువకుడు తనకు కలం స్నేహితులు కావాలెనని వ్రాశాడే కాని, యే భాషలో తనకు ఉత్తరములు వ్రాయవలెనో తెలియజేయలేదు. ఇది నా వంటి కలం స్నేహితులకు కలిగెడి, ఒక పెద్ద సందేహం. ఏ భాషలో కలంస్నేహం చేయవలసినది తెలియ జేయవలెనని నా కోరిక.

జి. జయప్రకాష్ (జమ్మలమడుగు)

* ఇంగ్లీషులో రాయవచ్చును.

## సీరియల్ కథలు

''మనసున మల్లెలు'' కథ చాల ఇంపుగా ఉంది. కథ చదువుతూంటే ముందు జరుగబోయేదాన్ని గూర్చి ఆదుర్దా కలగడం కథలోని డిమాన్ స్ట్రేటర్ రామారావుగారు ప్రసాద్‌తో తనకు విమలపై గల ప్రేమను గురించి చెప్పే సంఘటన నాకు చాల బాగా నచ్చినది.

కె. కృష్ణప్రసాద్ (వేటపాలెం)

* * *

''మనసున మల్లెలు'' కథ నన్నెంతో ఆకర్షించింది. కథ చాలా బాగుంది. అందరికీ అర్థమయ్యే శైలిలో ఉన్నది. ''అరే ! కథ అప్పుడే అయిపోయిందే. ఇంకా ఉన్నా బాగుండును, అని అనిపించింది. ఇంత చక్కని కథ మాకు అందించినందులకు ''రంగధామ్'' గారికి నా కృతజ్ఞతాభివందనములు.

జి. ఉదయ భాస్కర్ (ఘంటసాల)

* * *

ఈ వారంలో మిగిలిన మల్లెల పరిమళాలతో మనసు మత్తెక్కి పోయింది. మరచి పోదామన్నా మరువురాని మహత్తర సన్నివేశాలు సినిటెక్‌గా చిత్రించిన శ్రీరంగధామ్ గార్కి నా అభినందనలు. పాత్రలలో ఏకీకృతి వంది స్వానుభవం లాగ అనుభూతి పొందారు ఆ కథ చదువుతున్నంత సేపు. బహుశా నా పేరు నాయకుని పేరు ఒక టవ్వటమే కాక, కథానాయికాక పేరు నా జీవిత నాయిక పేరు ఒకటి కావటం కారణమేమో !

ప్రసాద్ (అనకాపల్లి)

## కథలు

7—8—64 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ప్రచురితమైన 'ఎదురు చూసిన వసంతం' అనే కథ చాలా బాగుంది. కథ చదువుతున్నంత సేపు ఏమి జరుగుతుందన్న ఆతృత కలిగించింది. కాని, ముందు పాఠకులను భయాందోళనలతో ముంచి, శ్రీధర్ సజీవంగా ఇంటికి చేరినట్లు, రెండవసారి ఇంటికి చేరుతున్న శ్రీధర్ కారు ప్రమాదానికి గురియై మరణించినట్లు రచించి శారదకు తీరని అన్యాయం చేశారు రచయిత. కథ ముగిశాక నేత్ర ద్వయం కన్నీటితో నిండిపోయింది.

టి. లక్ష్మి (పాలకొల్లు)

* * *

7—8—64 వారపత్రికలోని ''ఎదురు చూచిన వసంతం'' శ్రీధర్ వర్షంలో కారు చీకటిలో భయంకర ప్రయాణం గూర్చి చదువుచున్నంత సేపు ఇక ముందేమి ప్రమాదము ముంచుకొస్తుందో అన్నట్టున్నది. గాని కథ చివర ఆహ్లాదకరంగా ఉన్న రాత్రి క్రవంతెన విరిగి మరణించటం విచిత్రంగా ఉన్నది. నదికి క్రవంతెన ఉండదు. చిన్ని కాలువలకు కర్ర వంతెనలు ఉండవచ్చును. ఒక వేళ అది విరిగి కారు కాలువలో పడినను, మరణించేటంతటి ప్రమాదముండదు. శ్రీధర్ మరణించుట అసహజంగా ఉన్నది. కథకు న్యాయం చేకూరలేదు.

ఎమ్. రత్నరాజు (నర్సాపురం)

## సినిమా

14—8—64 తేది ఆంధ్రసచిత్ర వారపత్రికలో మా అభిమాన నటి అయిన కుమారి—విజయలక్ష్మిగారి పరిచయం చదివి మేమంద రము ఆనంద సాగరంలో మునిగి తేలాము. ఆమె గారి పరిచయాన్ని చదివిన కొలది మరీమరీ చదవాలనిపిస్తుంది. ఇప్పటికయినా మా నాట్య నటిని పరిచయం చేసినందులకు సి. ధర్మారావు గారికి, మన అభిమాన ఆంధ్రసచిత్ర వారపత్రికలో ఈమె గారి పరిచయాన్ని ప్రచురింప చేసిన మన ఎడిటర్ గార్కి పరిచయంతో పాటు ముత్యాల లాంటి ఫోటోలు తీసిన ప్రభాకర్ గార్లకు పాఠకుల తరఫున మా తరఫున అభివందనములు అర్పిస్తున్నాము.

కే. జి. వసంతాదేవి, కే. జి. బాబురావు, సువర్ణాదేవి (ఈ. తాండ్రపాడు) ★

మీరు డ్రిల్లు, లాంగ్‌క్లాత్ కొనేటప్పుడు...

# ట్విన్ టస్కర్

చిహ్నంకోసం చూడండి.

ఈ చిహ్నం మీరు విశ్వసించదగిన నాణ్యతకు ఇది గుర్తు!



## హార్వే ట్విన్ టస్కర్

డ్రిల్లు, లాంగ్‌క్లాత్

మధుర మిల్స్ ఉత్పత్తి - నాణ్యమైన నూలుకు మారుపేరు.

మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై

మేనేజింగ్ ఏజెంట్లు: ఎ & యఫ్ హార్వే లిమిటెడ్



B3.MMC-13 A TG

# మధురకు చేరిన హార్వేస్

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 28—8—'64
క్రోధినామ సం॥ శ్రావణ మాస బ॥ పంచమి
సంపుటము 56 సంచిక : 52

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం
చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28 60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్ జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1




"నీ దొంగతనాలు మేం ఎప్పుడు కనిపెట్టినా నువ్వు అంతే. నీకు మేలు చేస్తున్నాం అనుకున్నావా! లేదా పోలీసులకు చెప్పినా ఏం చేస్తావే గుండె ఆపుతుంది తెలుసా."

## మనలో మాట

ఐర్లాండ్ వనిత 'డెర్వ్లామర్ఫీ' చెప్పిన తన ఆరువేల మైళ్ళ అద్భుత యాత్ర కథను 28వ పేజీలో ప్రారంభించాము. ఈ 'జెట్ యుగం' లో యిలు వంటి సాహసానికి పూనుకోడమే గాక ఆమె విజయవంతంగా తన యాత్ర ముగించింది. సాధారణంగా స్త్రీలు ప్రయాణాలలో 'సామాను - సరంజామా' యెక్కువగా తీసుకు వెళ్తారంటారు. కాని యీమె తన పధ్నాలుగు మాసాల సాహస యాత్రను చాలా కొంచెం సామానుతోను, చాలా పొదుపుగాను పూర్తిచేసింది. నాలుగైదువారాలపాటు ఉత్కంఠతో సాగే ఈ యదార్థ సాహసయాత్ర మా పాఠకులకు నచ్చుతుందని అనుకుంటున్నాము.

*  *  *

14-8-'64 సంచికలో 'శ్యామసుందరి' అనే కలంపేరుతో శ్రీమతి జె. వరలక్ష్మిగారు వ్రాసిన 'స్వేచ్ఛా భారత్‌లో స్త్రీ...' వ్యాసం ప్రచురించాము. ఈ సంచికలో ఆమె 'అమెరికాలో విదుషీమణులు' అనే వ్యాసంలో అక్కడవారి కున్న అవకాశాలు, విద్యారంగంలో వారి అభివృద్ధి, ఉద్యోగాలలో వారి ప్రగతి ప్రస్తావించారు- కాని ఈవారమే నాలుగైదు వారాలుగా చోటుకోసం ఎదురుచూస్తున్న 'ఉత్తరాదివంటలు' వెయ్యాడం వల్ల-యీ 'వ్యాసం'లోని తతిమ్మా భాగం పైవారం ప్రచురిస్తున్నాము. ఆభాగంలో వ్యాసరచయిత్రి అక్కడి స్త్రీలు-స్వచ్ఛంద సంస్థలలోను, రాజకీయ రంగంలోను ఎలా వుంటున్నదీ, పేర్కొన్నారు. ఈ 'వ్యాసావళి' లో క్రమంగా ఇటలీ; జపాన్, రష్యా మొదలైన దేశాలలోని 'స్త్రీ'ల అభివృద్ధి గురించి కూడా వ్యాసాలను వెయ్యగల మనుకుంటున్నాము.

*  *  *

ఈవారం 'సరాగమాల' [11 వ పేజీ] కృష్ణాష్టమి [ఆగస్టు 30 వతేదీ] సందర్భంలో ప్రత్యేకం! వేసిన రెండుకథలలోను ఒకటైన 'ప్రేమలేఖ' మామూలుగా వేసే కథలకన్నా కొంచెం పెద్దది!

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : తార బి. సరోజాదేవి

భారీయెత్తున దేశరక్షణకు
ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం


భూమి పరిస్థితి ఇది! అధికోత్పత్తికి మార్గం ఇంకెక్కడ?
రైతు
భూమి కమతాల గరిష్ఠ పరిమితి


పాతకథే
అమెరికాకు తన శక్తి చూపాలని చైనా, ఉత్తర వియత్నాం సరిహద్దులలో సైనిక విన్యాసం జరుపుతున్నదా?
అమెరికా
చైనా


ఊహాలోకంలో ప్రణాళికలు
ఈ గాలి మేడల వల్ల ప్రయోజనం వుంటుందా?


ఏదో వెనకాల పీడ భయం
ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రిణి
త్రిపాఠీ

కుంది. అతన్నే నమ్మి, తన్నే అమ్మింది. అప్పటికి దేవరకు వయసులో వలరాజు పలకరించాడు. సౌంధర్య దిదృక్ష అంతకే ఎదిగింది. రాచరిక మర్యాద రంపపు కోత కోసింది. పాతికొచ్చేదాకా వలపు పాతి పెట్టమంది. మర్యాదకు మనస్సు లేదు. వయస్సు రాదు. ఆడదానితో అవసరం అంతకంటే లేదు.

సంజవేళ హంసలదీవి తిన్నెలపై కాలుసాగి ఏటిగాలి కెరటాలకు పోలి తేలి తూలి తెరచాప సొగసు చూసి ఈవల ఒడ్డుదిగి మెరకలంక లెక్కి పల్లపు డొంకల పడి ఒంటరితనం వెంటపడకున్నా దేవర జంట కొంచెం జతగాళ్లున్నా గుండెలో ఎవరో లేరు. ఎందుకో కాళీగా ఉంది అన్నమాట అనిపించిన తొలి సంజలో పిల్లగాలి చెవుల్లోన ఈలవేయ బోయింది. చలి కొంచెం కవ్వించింది. మునిమాపు మాగన్ను వెట్టి కొండంతను దాచింది. జాగిలాల వగర్పులో అలసట ఏదో తోచింది. వయస్సుకు మనస్సుకు పుల్ల విరుపు జరిగింది. తిరునాళ్ల మాట మన స్సులో తిరిగింది.

ఆ దారి కొత్తకాదు. దారి పక్క కొత్తకాదు. అప్పటికే మనువు కుదిరింది వీణకు. ఆ వాడంతా మారింది. మనువులే తప్ప మనుగడకు వేరే జోలి వద్దనుకుంది. జోక్యం లేదనుకుంది. సరసుల మంటూ వచ్చి చెలిమినీ బలిమినీ కలిమినీ కలిపి సానబట్టే సానువుల పేటయింది సానిపేట— మానవులా వీరు సానువులన్న పేరూ గడ పెక్కింది.

అయినోడికే ఇచ్చి అందలం ఎక్కించి వూరే గించి వూరంతా వచ్చి దీవెనలు చేసే నాడూ దగ్గర పడింది. వీణ మనసు హంసల దీవి వేణుగోపాలుడికే అంకితం చేసింది. వయసు మాత్రం వలచిన వాడెవడో ఆ చిన వాడికే ముడుపు కట్టింది. దేవ దాస్యంతో లాస్యం ఒలకబోసింది. ఆ నాడు కృష్ణా ష్టమి. పసితనం, ముసలితనం పడుచుతనాన్ని పట్టుకు వేళ్లాడుతూ ఆ తిరునాళ్లకు వచ్చి సము ద్రంలో తానాలు, సామిముందు దణ్ణాలు చేసి సాయంకాలానికి వీణసాని విలాసం చూడాలని మంటపం చుట్టూతా విడిది చేసినాయి. అక్కడే యువరాజు వీణ విలాసం చూశాడు. పంచేంద్రి యాలు పరవశించాయి. పలకరించాయి. వెను దిరిగినా కనుదిరగ లేదు.

ఆ నాటి ఆ పాటా, ఆ ఆటా అతని డెందంలో చిందుతూనే ఉన్నాయి. కట్టుబడి రాచరికానికి కానరాని పెట్టుబడిగాన అందుకే కట్టుబడి పాతి కొచ్చేదాకా మనస్సును పాతిపెట్టక తప్పదను కున్నారు. కాని మనస్సు మాట విన్నదా ? వూహూం అన్నది. ససేమిరా సరసుడా అన్నది. ఆ సానిదాని వరసజేరి సరసుడవనిపించుకోరా నీ సరదాలు తీర్చు కోరా అన్నది. కోరాలి గాని కొరతేముంది రాజు లకు ? కోరమీసం కోమలంగా దువ్వి కోరికను కొంచెం చూపుతో రువ్వి జతగాణ్ణి నవ్వద్దని ముందుగా తనే నవ్వినట్లు నవ్వి. . . .

ఆ దారి పక్క సానివాడ జేరి దానివైనమేమో తెలిసి రమ్మన్నాడు. అప్పటికే వల్లమాలిన వసం తాలు వల్లకాటి వరకూ సాగనంపితే గాని సాగ నంటున్న దాని తల్లిని కృష్ణహరిని ఈ జతగాడు చేరి అడుగంగా—

రాచరికం వెంట పడ్డదని చూచాయగానే సంతోషించి 'అయ్యా ఆయనదేమో కోడె వయస్సు— ఆమెదేమో వెన్న మనసు. మనువు కుదిరినా మనసు రాజునే కోరింది. ఆసమీద అట్లాగే అక్కున జేర్చుకోండి అన్నది' ఆ కన్నది.

ఆసయేమి ఆవైసమేమి అన్నాడు వీడు— 'మనువు మన్నంత కాలమూ ఉండేది. మనసు మనకు చెప్పకుండానే మందుకు మళ్లే మాయ మవుతుంది. ఆ మనువు మాపుకున్నందుకే ఆమనసు మార్చుకున్నందుకు ఆ మనువుకుమళ్లే ఈ ప్రభువు కటాక్షం కూడా పది కాలాల పాటు, దాని బతుకు పండి పనిలేదనే వరకు నిలిచేనా ? దొరకుసాని అయినా దొరసాని కాలేదు గదా. మరోదిక్కు లేనందుకు, పోనందుకైనా మడికట్టుకో మన్నందు కైనా ఇదుగో యావజ్జీవితం ఈ మడి కట్టుకో అనే నా మారాజు మాటాడు' అని కృష్ణహరి అను భవం కలదేమో అంతా అడిగింది.

రాచరికం సరేనంది. కన్నెరికం మరేనంది. పెద్ద దొరకు తెలికుండా వద్ద జేరాలన్నాడు చిందొర. అంతా గుట్టుగాడ మడికట్ట బెట్టటం మంచి మడికట్టు కోడం వరకు జరిగాయి.

వీణ పాడుతుంది— ఏదీ ఓ పాట— ఆదే తొలి ఆట కూడా.

'ఏం కావాలి'

'బలేజావళి'

'బలేజావళీ— అబ్బో— సరసులే దొరవారు' అన్నది ఆ చిన్నది.

'సరసం నీలోనూ ఉందిలే జవరాలా' అన్నాడు మళ్లీ దొర—

'లే జవరాలా ఇందునా సరసమేనే అయినా ఇప్పు డింత లేత అంటారు. తొలివలపు తొలకరిజల్లు కురిసి వెలిసిందీ అంటే అప్పుడూ చిరాకు చిత్త గిస్తారు దొరవారు.' అన్నది ఆ సరస్వతి.

చిన్న వాడు దాని మాటకు పలుపుకు కలుక్కు మన్నాడు. 'జాణవేను వీణా' అన్నాడు.

'అందుకే గదా మీ రందుకున్నది' అంటూ మాటలో తళుకు చూపులో విసిరింది. ఇతగాడి లోపల కావున కసిరింది.

'అందుకోసం కాదే అల్లందుకోసం' అన్నాడు.

ఆ పైన ఆమె మాటలు ఆపింది. ఆపక చేసే దేముంది ? చూపులతో విరితూపులు దూసింది.

మరి ఇంతకీ ఉత్తమాట కచేరీయేనా— పాట, ఆట కలిపి కచేరీ చేసి మమ్మల్ని ఉద్రూత లూగించవా అన్నాడు.

ఆమె మాటాడనైనా లేదు.

అతను చూస్తూనే ఉన్నాడు.

పరివేష్టించిన వాద్య బృందం ఎప్పుడు చేరిందో తెలియదు.

ఆమె మంచి గంధపు సువాసనలు విరజిమ్మే మత్తుహత్తే ఓ దండ అతని గళసీమున వేసింది. కాంబోదిరాగచ్ఛాయా రాగంలో రాగ ప్రస్తారం చేసింది. అక్షరాలా ఇలా పాడింది—

పలుకనేరని బాంపు నీ
అలుక పైపగ జాలము—
కలికి వెన్నెల చిందె
చెలికి చందురుడందె
అందని అందాలు
అందిన వను మాట
పొందుగా వినువిందుగాడ ॥పలుక॥
దొరకే సానినైతిని— నే
దొరసానిగా నైతిని

## ఇంటింటి పజ్యాలు

### ఆరుద్ర

### 'పొగ'ల మోతుబరి

సిగరెట్లు కాల్చకండ్రా అనేవాడు మాపిన తాత
చెప్పలేదాయన ఇలాగ చాదస్తం చేత
ఆధునికుడే ఆయన అహో్మ
ఆదికాలపునాటి బ్రహ్మో
కడవరకూ చదివాడు హేవలాకు ఎల్లీసు
కంఠతావచ్చును బైరనూ కీట్సూ షెల్లీసు
భరించలేక ఆయన చీవాట్లు
పాపం మానేశాను సిగరెట్లు
ఇప్పుడు నేను కాలుస్తున్నవి బీడీలు
ఇంకా తప్పలేదు నా కాయన తిట్ల దాడిలు
అవతల పారేయమంటాడు బీడీ కట్ట
హాయిగా కాల్చుకోమంటాడు చుట్ట
అసలు సిసలు పొగాకు
ఆయనక్కాదు చికాకు.



## పుఖారి

అందుకే అల్లందుకే

తొందరించి కందళించె డెందమని ॥పలుకు॥

ఆమె వ్యంగ్య చమత్కార భాషా వైభవానికీ, శరీర విన్యాస విశేషానికీ, శారీర మహిమాద్భుత మధుర ప్రస్తారానికి పై గీతం సంకేతంగా నిలిచి పోయింది యువరాజు మదిలో, ఇతగాడికి ఆమె గులాబీ పూల పూజచేసింది.

ఇతడే, ఆ మాటే, ఆమెతో అన్నాడూ 'వీణా. —దొరకు సానివైతివి, దొరసానివిగా నైతివి అవి నీవు విసిరిన గులాబీ పూబంతులు నాకు గుచ్చుకో లేదనుకున్నావా, పూలవంటి మాట వెనక ముళ్ళు నాకు సోకలేదనుకున్నావా, అని అందుకు ఆ చమత్కారి, కళ్ళింతగా అలనాటి వరూధినిలా చేసి 'అటాగా స్వామీ అవి గులాబీలు కదా అనుకున్నారు గాని గుచ్చుకుంటాయనుకోలేదు' అని— 'ముల్లు కొక ముద్దుగా ముచ్చట తీర్చాలి' అంటూ ఆమె అందించిన ఆకు చిలకను అందుకున్నాడు. ఆమె నవ్వింది. ఆ నవ్వులో యవ్వనం పొంగింది. వయస్సు ఉందగించింది. భయం మందగించింది. బొండు మల్లెల వానకురిసినట్లే అయింది. విదియ నెల కళలీనినట్లే ఉంది. కోరిక తీరినట్లూ ఉంది. ఊరిక లేత్తినట్లూ ఉంది. ఇక్కడ ఇలాగే ఇష్టం వచ్చినట్లు తెల్లవారి పోయింది కొన్ని వసంతాలు.

ఓ నాడు తెల్లవారి లేచి చూస్తే కసవులేదు. గుమ్మానికి తలుపూ లేదు. అడగడానికి చెప్పడానికి తనే మిగిలింది వీణ—కృష్ణాహరి లేదు, యువరాజు దేవరకోటలో తప్ప తెలుపు తూర్పున చూడలేడు. చూడరాదు. దేవర కన్నెరికం పట్టిన పిల్ల దేవు లాటకు గడప దిగుతుందా ? మరు నాడూ కొంప బావురు మంటూ పొద్దు కూకింది. ఆహారం లేదు. తాను ఆహార్యమూ వేసుకోలేదు. నెలరేడు పిలిచాడు. చలిగాడు గిచ్చాడు. యువరాజు వస్తాడని ఆమె అంతో ఇంతో ఉందం ఉన్న అందానికి హత్తుకుంది. ఎవరూ రాలేదు. ఊసు చెప్పే వారూ లేరు.

అర్ధరేయి నిదురోయి మేలుకుంది. ఆమె కంటికి కునుకు పిలవనూలేదు. రానూలేదు. అశ్వగమనధాటి గుండె గుబిగుబితో కదం తొక్కి లోగిలి ముందు ఆగింది. నిటారైన చీకటి ఒకటి గుర్రం దిగి తలుపుదాకా వచ్చి లేని తలుపు కొట్టకుండా లోనకే వచ్చింది. మనస్సులో ఆశవు కళ్ళు వెక్కిరిస్తున్నాయి. ఆనురాగాన్ని ప్రాణ భయం సాహసం చేయడం లేదు. ఆమె పెరటిలో అరటి బోదెల వంక వణుకుతున్న కాళ్ళతో నడిచింది. వెన్నెలైనా అతని వన్నె చెప్పాలని — దాచరికం తొడుక్కున్న ఎవరో ముది పెద్దపులి — 'ఆగు' అన్నది, ఆమె ఆగింది.

యువరాజునే దరిచేర్చి రాచమర్యాదను నేలరాచి

46 వ పేజీ చూడండి

# సరాగమాల

వి.ఎ.కె. రంగారావు

శ్రీ 'ప్రణయ బృందావని,—'
'మధురాధిపతే రఖిలం మధురమ్,' అన్న
సరసోక్తికి లలిత విదర్శనముగా,—
సర్వ మధురముగ— ఈ రేయి,—
నవన లాలిత మయ్యెనని,— భావన—
కలివేలుపు చిరునవ్వులే, కలకాలము మీకై తల
మొలగేనని,— దీవెన
—మల్లాది రామకృష్ణశాస్త్రి

* * *

అంతటి దీవెన నాకు దొరికినప్పుడు ఇక 'ప్రణయ బృందావని' బాగున్నదంటే నా ఘనతే మున్నది. ఆ కృష్ణుని చలువ, ఈ రామకృష్ణుని దీవెన విలువ లోపాలుంటే ఆ లోటు నాది. అభిప్రాయాలు వ్రాసి పంపిన వారికి నా కృతజ్ఞతాభివందనలు కాని ఒక విషయం. విజయవాడ, గుంటూరు, రాజమండ్రి ప్రాంతాల నుంచి ఆ కార్యక్రమం వినబడలేదని ఉత్తరాలు వచ్చినవి. తరువాత రేడియో శాఖ వారి ద్వారా తెలిసింది. వాణిలో ఉండటం షార్ట్ వేవ్ అని ఉన్న తెలుగు కార్యక్రమాలు అందులో ప్రసారం కావని. ఈ విషయం తెలియక సరాగమాలలో ఈ కార్యక్రమం గురించి వ్రాశావే అని చింతిస్తుండగా శ్రీకాకుళం జిల్లాలో సీతానగరం నుంచి ఒక శ్రోత లేఖ అందినది. ఈ విచిత్రం నాకు బోధపడలేదు. ఒక నాటి రాత్రి ప్రోగ్రామ్ వినరాలేదని తెనాలి నుంచి కె. సంజీవి ట్రంకాల్. ఆ రెండవ దినం ఉదయం సీతానగరం నుండి తాండ్ర కూర్మారావు వ్రాసిన అభినందన లేఖ. ఇందులో చిక్కుని ఆకాశవాణే విప్పాలి.

ఒక శ్రోత "సంగీత సాహిత్య ప్రియులకు మీ సంగీత రూపకం ప్రణయ బృందావని, వసంత యామిని" వగై. ఇది డబ్బా గాదు. నా మనసులో మాట (ఇదీ ఆ శ్రోత వ్రాసినదే!)

* * *

ఆగస్టు 30వ తేదీ శ్రీ కృష్ణజయంతి. భానుమతి స్పెషల్ న్యూస్ కావాలని కోరి 50 నయా పైసలు పంపిన వారందరికి పంపించాను. ఈపాటికి అందినవని, ఆ రికార్డులు ఆ నాడు వేసుకొని, విని ఆనందిస్తారని ఆశిస్తున్నాను.

* * *

విప్రనారాయణ ఎన్. 69802

"విప్రనారాయణ" చిత్రం ఏనాడో విడుదలయినా అందులో ఈ "రారా నా స్వామి రారా" అన్న క్షేత్రయ పదం ఇటీవలనే నా ప్రార్థన కంగీకరించి భరణిరాణి క్షేమల వాణి శార్వాణి భానుమతి చేసిన యేర్పాటు వలన ప్రజల కందుబాటులోకి వచ్చింది.

రచన క్షేత్రయ. రాగం కల్యాణి. వాద్య గోష్ఠి ఎస్. రాజేశ్వరరావు, పద్ధతి భక్తి జావళి. పాడినది భానుమతి. ఇక పలికినదేమున్నది, సువర్ణానికి సువాసన జోడైన పెన్నెలకు వేసవి తోడైన, మల్లెలకు మనోరమణుడు నీడైన ?

ఇందులో పల్లవి, చరణాలు వేరు వేరు క్షేత్రయ్య పదాల నుండి స్వీకరించ బడినవి. అయినా ఆ ఎన్నిక తెలిసిన వారు చేసినందువలన యెబ్బెట్టుగా లేదు. పదాన్ని జావళిగా పాడటం కూడా బాగా ఉంది. నిజానికి జావళికి పదానికి వస్తువులో తేడా యెక్కువగా ఉండదు. చౌకంగా పాడితే పదం వడిగా పాడితే జావళి అని స్థూలంగా చెప్పుకోవచ్చు. రచన సముద్రాలదని ఉన్నది. నమ్మకండి. ఇదీ, మొదటి భాగం చివరనా, రెండవ భాగం ఆదినా ఉన్న కుత్తుక కత్తిరింపులూ, రికార్డు చేసినవారిదో, వేయించిన వారిదో నిర్లక్ష్యమో, తెలియక పోవడమో అనే అనుమానం కలుగ జేస్తున్నవి.

ఈ రికార్డు రెండు భాగాలు. రెండవ భాగం చివర రెండు శ్లోకాలు ఉన్నవి. "బద్ధాంజలినా" శంకరాభరణంలోనూ, "నమామి నారాయణ పాద పంకజం" కానడలోనూ ఉన్నవి. జావళి భానుమతి యెలా పాడిందో చెప్పలేం అంటారేమో! వసంతాన్ని కోకిల యెలా పలకరిస్తుంది ? చంద్రికను జూచి చకోరి యెలా పలకరిస్తుంది ? కృష్ణుని కొరకు ధీరనాయిక యెలా పరితపిస్తుంది ? రసిక హృదయారామమోహనుని స్పర్శలో మేను యెలా పులకరిస్తుంది ? భానుమతి అలా పాడింది.

ఈ రికార్డు చిన్న పిల్లలు నృత్యం నేర్చుకోవటంలో కూడా అత్యంత ఉపయుక్తంగా ఉంటుంది. అందరి దగ్గరా ఉండవలసిన రికార్డు.

విష్ణుమాయ ఎన్. 69772

పై రికార్డులో రెండు ప్రక్కల కలిసి ఐదు పద్యాలు ఉన్నవి. రచన గబ్బిట అని ఉన్నది కాని, నాకు బమ్మెర పోతనామాత్యునిదనిపిస్తున్నది.

మొదటి పద్యం "శ్రీయుతమూర్తి" అన్నది. భాగేశ్వరి రాగంలో "మత్తుడు చైద్యుడు వడితా గాని పొనగనున్నవాడ"ని రుక్మిణి వాపోయినది. రెండవది కీరవాణిలో "వడిగ యేతెంచి నన్ను వివాహమాడి యే విధంబై చేకొని పోవవేని ప్రాణములు విడుదాన" అని రుక్మిణి హృదయ విదారకముగా కృష్ణుని ప్రార్థించినది. మూడవది "అన్నిం చెల్లి ఉద్విగ్నం బయ్యెన్ మానసము"ని డోలాయమనస్కయై హిందోళంలో రుక్మిణి తలపోసినది. నాల్గవది "నల్లనివాడు, పద్మనయనమ్ములవాడు. కృపారసమును పై జల్లెడి వాడు" అని కల్యాణిలో లోక కల్యాణు గూర్చి రుక్మిణి పాడినది. ఆఖరిది భీంప్లాస్‌లో "ప్రాణేశ నీ మంజు భాషల వినని కర్ణ రంధ్రముల కలిమియేల" అని రుక్మిణి ప్రశ్నించినది.

ఈ అయిదు పద్యాలు అనంత మోహను గూర్చి భువన మోహనముగా పాడినది ఎ. పి. కోమల ప్రతి పద్యంలోని స్వరాలను ముత్యాలు గుచ్చినట్లు పాడినది. అందులో కల్యాణిలో "కృష్ణుడే" అన్నపుడు మనకు వినపడేది రుక్మిణి గాని కోమల కాదు. అదీ కోమల ఘనత.

వరసలు యేర్పరచిన మల్లేశ్వరరావు ఘనత కల్యాణి పద్యం స్వరకల్పనలోనూ, శాస్త్రీయ

౫౫ వ పేజీ చూడండి



కల్యాణి వీరకథకు పాట రికార్డ్ అవుతున్నది
భానుమతి, సంగీత దర్శకుడు రాజేశ్వరరావులను చూడవచ్చును



'కరుణా' అన్నాను తలుపు తట్టి.

'ఎవరూ' అంటూ తలుపుతీసి, 'నువ్వా అన్నయ్యా' ంటూ కుర్చీ చూపించింది కరుణ.

'ఒక్క క్షణం ఆగు. కాఫీ తెస్తాను' అంటూ ోపలికి పోబోతున్న ఆమెని వారించాను. 'నాక ఉంది. వెళ్లిపోవాలి. నీ చేతి కాఫీ తాగటం నాక ష్టమే గాని నాకు టైము లేదు' అన్నాను.

'ఆలస్యం కాదులే' అంటూ లోపలికి వెళ్లి వెంటనే ఫ్లాస్కుతో తిరిగి వచ్చింది. గ్లాసులో కాఫీ పోసి ఇచ్చింది. తృప్తిగా తాగాను. మనస్సు ప్రశాంతంగా హాయిగా ఉంది. ఎండలో నడిచివచ్చిన అలసట పూర్తిగా మాయమయింది. ఆమెతో చెప్పినట్లు నిజంగానే నాకు అర్జంటు పని ఉంది కాని వెంటనే వెళ్లాలనిపించటం లేదు.

'అంతా కులాసాయేనా ? దర్శనాల్లేవు' అంది కరుణ.

'కులాసాయే గాని ఒక శుభవార్త తెచ్చాను. మనకి హైస్కూలు గ్రాంటు వచ్చింది. ఇప్పుడే వార్త వచ్చింది' అన్నాను ఉత్సాహంగా.

'తెలుసు' అంది కరుణ.

నేను ఆశ్చర్య పడిన మాట వాస్తవం. ఈ వార్త ఇంకా ఎవరికీ తెలిసే అవకాశం లేదు. కరణం గారికీ నాకూ మాత్రమే తెలుసు. కరుణ మూడో ఫారం చదివింది. తర్వాత చదువు ఈ వూళ్లో లేదు. వూరికి ఆరుమైళ్ల దూరంలో ఉన్న పట్నం వెళ్లి చదువుకో వలసి వచ్చింది. అది చాలా పెద్ద ఇబ్బంది అని చెప్పక తప్పదు. అందులోనూ కరుణ లాంటి పెద్దింటి అమ్మాయిలకి దాదాపు అసాధ్యం. వూరి నించి పట్నం వెళ్లటం, అక్కడ ఆమెకి వసతి, ఎవరింట్లో ఉండాలన్న ప్రశ్న, ఈడొచ్చిన పిల్లని మరొకళ్ల ఇంట్లో ఉంచకూడదన్న భావం— ఇవి ఆమె ముందు చదువుని కష్టతరం— దాదాపు అసాధ్యంగా— చేశాయి. వూళ్లో చాలా మంది తమ

పిల్లల చదువుకి అలాగే స్వస్తి చెప్పుకున్నారు.

హైస్కూలు వూళ్లోనే పెట్టించాలన్న వూహని ఒక నాడు కరణంగారు వ్యక్తం చేశారు. ఆ విషయం ముందు నాతో చెప్పాడు. అసలాయనకి ఏ వూహ కలిగినా ముందు నాతోటే చెబుతారు. మాకు కరణంగారు దూరపు బంధువు. కాని వారి కుటుంబం అంతటికీ సన్నిహితుడను నేను. ఆయనని బాబాయి అని పిలుస్తాను. బంధుత్వాల విలువలు తగ్గి పోతున్న ఈ రోజులలో కూడ ఆయన మమ్మల్ని మర్చిపోలేదు. మా ఇళ్ల మధ్యరాక పోకలు కూడా ఎక్కువగానే ఉండేవి. పండుగలు పబ్బాల విషయంలో అవి మరింత హెచ్చుగా ఉండేవి. పెద్ద పెద్ద వ్యవహారాల్లో కూడా ఆయన సలహా లేనిదే ఏ పనీ చెయ్యరు. పశువుల్ని బేరం చెయ్యడం దగ్గర నించీ ఆయనకుమార్తె వివాహ ప్రయత్నం వరకూ కూడ ఆయన నన్ను సంప్రదిస్తారు. ఆస్తి పాస్తుల్లో సమవుజ్జీ కాక పోయినా ఆయన మా కిస్తున్న గౌరవానికి మాకు ఆనందం కలిగేది. దాని ఫలితంగా స్కూలు మంజూరు విషయం లోను తదితర విషయాల్లోను నా సహకారం ఆయనకి లభ్యం అయింది.

ఆయన స్కూలు వూహ వ్యక్తం చెయ్యగానే నేనూ నా అంగీకారం తెలిపి నా సంపూర్ణ సహకారం ఉంటుందని హామీ ఇచ్చాను. కరణంగారి పని అయితే నేను నా తలతో చేస్తాను. అందులో వూరి బాగోగులు కూడా ఉన్నాయి కాబట్టి నా సర్వ శక్తులా ధారపోశాను. ఇద్దరం నడుం కట్టాక కార్యం కష్టం కాలేదు. కరణంగారు తీసుకున్న ఉత్సాహం, చొరవ అపూర్వం. పెద్దలని ఒప్పించి ప్రోత్సహించడం దగ్గర నించి విరాళాలు పోగుచేసి అధికారులని మెప్పించి మంజూరు చేయించేదాకా ఆయన విశ్రమించలేదు. స్కూలు గ్రాంటు అవుతున్న దన్న విషయం నిన్ననే నిశ్చయంగా తెలిసింది. అయిందన్న విషయం ఇప్పుడే తెలిసింది ఆ సంగతి ఎవరికీ తెలీదు, నాకూ కరణంగారికీ తప్ప. ప్రత్యేకించి ఇంట్లో ఆడవాళ్లకి తెలిసి ఉండటానికి వీలులేదు.

‘ఎలా తెలుసు ?’ అన్నాను ఆశ్చర్యంగా కరుణతో. ఆమె ఇంకా ఆశ్చర్యంగా చూసింది.

‘నాన్న గారికి ఆ సలహా ఇచ్చింది నేనే కదా !’ అంది.

‘ఏమిటీ’ అన్నాను ఆశ్చర్యంగా.

‘అవును నాన్నగారు పట్నంలో నా చదువు కోసం ప్రయత్నించి బసకుదరక, కుదిరినా నన్ను మరో చోట ఉంచలేక మధన పడి, బాధపడి ఆఖరికి ఒక నిర్ణయానికి వచ్చిన నన్ను ఇంక చదివించనని చెప్పినప్పుడు స్కూలు మన వూళ్లోనే పెట్టించుకో వచ్చుననీ, అదెలా సాధ్యమో కూడా నాన్నగారికి సూచించాను నేను’ అంది.

నాకు నిజంగా చాలా సంతోషం కలిగింది. నాకిందుకే కరుణంటే ఇంత ఇష్టం. కరుణ అందరు ఆడవాళ్ల లాటిదీ కాదు. తన జీవిత గమనాన్ని తనే నిర్ణయించుకుంటుంది. అందరు ఆడవాళ్లల్లా విధికి వదలెయ్యదు. తనకి ఒకటి మంచి దనిపిస్తే అది సాధించేందుకు ఆమె సర్వప్రయత్నాలూ చేస్తుంది. అవసరం అయితే సాహసం అనిపించుకో దగ్గ కార్యాలు చేస్తుంది. సామాన్యంగా అన్నీ ఆమెకి అనుకూలంగానే పరిణమిస్తాయనే ఆమె నమ్మకం.

వాళ్ల అమ్మ అనేది "దీనికి అన్నలూ, తమ్ముళ్లు లేరనే దిగులు నాకు లేదు. దాని బ్రతుకు అది చూసుకో గలదు’ అని.

కరుణతో నాకు చిన్నప్పట్నించీ పరిచయం. ఇద్దరం కలిసి ఆడుకునే వాళ్లం. కథలు చెప్పుకునే వాళ్లం.. సరదాగా తిరిగే వాళ్లం. రోజల్లా కలిసి ఉండే వాళ్లం. కరుణకన్నా నేను అయిదేళ్లు పెద్ద. అయినా నేను కరుణతోటే కలిసి తిరిగే వాడిని. మా ఇద్దరి మధ్య వయస్సు భేదం అడ్డురాదు. ఇప్పటికీ బయట ఎంత పెద్ద మనిషి నయినా కరుణ దగ్గర చిన్న పిల్లవాడినే.

కరుణ, కరణంగారి ఏకైక పుత్రిక. చదువు లోను, అందంలోనూ వూరికి మాణిక్యం లాగా ఉంటుంది.. కరణంగారు ఈమెని చూసి గర్వపడే వాటిలో ఈ రెంటినీ మించి వినయం, వివేకం, ధైర్యం కూడా ఉన్నాయి.

‘ఏమిటి ? అలా పరధ్యానంలో పడ్డావు ?’ అంది కరుణ.

‘ఏం లేదు. మన చిన్నప్పటి విషయాలు గుర్తుకు వచ్చాయి’ అన్నాను.

హైస్కూలు స్థాపనకి సర్వసన్నాహాలూ జరిగి పోయాయి. స్కూలుకి భవనం, ఆటస్థలం నిర్ణయమయి పోయాయి. విద్యార్థుల నుండి దరఖాస్తులు కూడా వచ్చాయి. టీచర్ల నియామకం కూడా జరిగి పోయింది. దాదాపు అంతా సవ్యంగా జరిగి పోయింది. ఒకసారి మాత్రం వినీ వినపడకుండా చిన్న విమర్శ వినపడింది. కరణంగారు తన అవసరం కాబట్టి స్కూలు విషయంలో ఇంత శ్రద్ధ తీసుకున్నారనీ, లేకపోతే తీసుకునేవారు కారనీ. మేము ఎవరం దాన్ని లక్ష్య పెట్టలేదు.

ఆ తర్వాత, రెండు రోజులకి ఈ కథకి నాయకుడైన విశ్వంతో పరిచయం అయింది నాకు. అతడు ఈ హైస్కూల్లో టీచర్లుగా ఎన్నికైన వారిలో ఒకడు. నాయకుడు ఎలా అయాడు అనేది చిక్కు ప్రశ్న. నాయికి తనకు తానుగా వరించిన వ్యక్తి నాయకుడు అవుతాడని మనం అంగీకరించే పక్షంలో అతను నాయకుడు అవుతాడు. కాని ప్రత్యేకించి విశ్వంలో నాయకుని లక్షణాలు ఎన్ని ఉన్నాయి? ఎన్ని లేవు? అని ప్రశ్నించుకుంటే ఈ ప్రశ్న అంత త్వరగా తేలదు.

విశ్వం అందగాడు. ఆకర్షణీయమైన రూపం. అతని కళ్లల్లో కనపడే అమాయకత, స్నేహం నన్ను ఆకర్షించాయి. నన్ను నేను పరిచయం చేసుకున్నాను. విశ్వంలో ఎదుటి వారిని ఆకర్షించే శక్తి విపరీతంగా ఉంది. అతన్ని చూడగానే ఎందుకో అతను మన వాడన్న భావం కలుగుతుంది. అభిమానం, వాత్సల్యం కలుగుతాయి. ఆడవాళ్లకి ప్రత్యేకించి ఏమి భావాలు కలుగుతాయో నా కప్పట్లో తెలియ లేదు.

అయితే ఎవరూ మెచ్చని విషయం ఒకటి ఉంది అతనిలో. పిరికి తనానికి మారుపేరేదంటే విశ్వం అని ఠక్కున సమాధాన మిస్తారు మామిత్ర బృందంలో ఎవరైనా సరే. విశ్వం పిరికి తనానికి అనేక రకమైన కథలున్నాయి. అందులో చాలా వరకు నిజమైనవి. మరికొన్ని అతన్ని రెచ్చగొట్టి ధైర్యంగా చెయ్యడానికి మా మిత్ర బృందం కల్పించినవి. అయితే విశ్వం రెచ్చిపోలేదు. ఆ కథలని ఖండించనూ లేదు. పైగా అవన్నీ నిజమని ఒప్పుకునే వాడు కూడా. విశ్వం పిరికి తనానికి తోడు నిర్లిప్తత. ఒంటరితనంలో ఆనందం అతనిలో కన్పించేవి. వీటిని పోగొట్టడానికి నేనూ అతనితోటి ఉపాధ్యాయులూ చేసిన ప్రయత్నాలేమీ ఫలించలేదు.

**కె. సూర్యనారాయణమూర్తి**
**రామచంద్రరావు**

అతనివి నిస్సహాయత కన్పించే కళ్లు. ధైర్యం చేసి నిర్ణయం తీసుకోలేని అతని అసమర్థత మాకు చిరాకు కల్గించేది. చిన్నప్పుడు క్లాసులో తనకి తెలియని విషయాన్ని గురించి మాస్టరుని ప్రశ్నించటం దగ్గర నుంచి, ఈ నాడు తనకు వివాహ ప్రయత్నాలు చేస్తున్న తల్లిదండ్రుల్ని వారించటం దాకా కూడా అతని అసమర్థత కనిపిస్తుంది. ప్రతి చిన్న విషయములోను ఇతరుల సలహా, సహాయము మీద ఆధారపడేవి విశ్వాన్ని ఎలా ఉత్తేజితుణ్ణి చేసి, మనుష్యులలో పడవేయాలో మాకు బోధ పడేది కాదు. మేము అతన్ని గురించి ఇంత పట్టించుకోవటానికి కారణం అతని మీద మాకు గల అపారమైన ప్రేమ, వాత్సల్యం.

అయితే ఏ విషయానికైనా మార్పు ఉంటుందని, అది నమ్మలేనంత అద్భుతంగా ఉంటుందని మేము వూహించలేదు. ఆ మార్పు విశ్వంలోనూ కనిపించింది. విశ్వం ఒకానొక విషయంలో— తన జీవిత సమస్యలో— ధైర్యం చేశాడు. అది అతను గాని, మేముగాని వూహించలేని సంఘటన— అతను ప్రేమలేఖ వ్రాయటం! కూడా తోడులేనిదే సినిమాకి కూడ వెళ్లలేని విశ్వం ఇంత ధైర్యం చేశాడంటే నమ్మలేక పోయాను. ఏమయితేనేం, అది అతని జీవితాన్ని మార్చివేసింది. అది అతని జీవితాన్ని ఎలా మార్చిందో చెప్పేముందు అతన్ని గురించి మరికొంత చెప్పాలి.

అదృష్టం ముందు పుట్టి తర్వాత విశ్వం పుట్టాడు. అతనికి కావాల్సినవన్నీ అతను అడగకుండానే, ప్రయత్నించకుండానే అతనికి లభ్యమవుతూ ఉంటాయి. కోరి! వలచి వస్తూంటాయి. అతను దేనికోసమూ కష్టపడేవాడు కాదు. అతని బస కోసం ప్రయత్నించింది నేను. కాళ్లరిగేలా తిరిగి వాకబు చేసినా కాస్తమంచి వసతి ఎక్కడా దొరకలేదు. దొరికినవి అలగాజనానికి పనికి వచ్చేవి కాని విశ్వంలాంటి వాడికి కాదు. ఇలాంటి పరిస్థితిలో కరణంగారు అతన్ని సాదరంగా ఆహ్వానించి తన ఇంట్లోనే ఉండమని అడిగారు. ఇందుకు విశ్వం అదృష్టం, కరణంగారి సహృదయత తప్ప మరే కారణాలు లేవు. విశ్వం వాళ్లింట్లోకి జేరాడు.

కరణంగారింట్లో అతనికి చక్కటి ఆదరణ లభించింది. ప్రొద్దున్నే కాఫీ ఫలహారాలు, తర్వాత స్నానానికి ఏర్పాట్లు ఇంకా మిగిలిన ఏర్పాట్లు అన్నీ సవ్యంగా జరుగుతాయి. అతని గది తీర్చి దిద్దబడి ఉంటుంది. అతను నిద్రలేవక ముందే గది ఎవరో వూడిచేస్తారు. లేచేటప్పటికి మొహం కడుక్కోవటానికి నీళ్లు సిద్ధంగా ఉంటాయి. ఇల్లాగే అన్ని ఏర్పాట్లూ అతనికి తెలియకుండానే జరుగుతాయి. వీటన్నిటిలోనూ ముఖ్య పాత్ర నిర్వహించే వ్యక్తి కరుణ అని నాకు తర్వాత తెలిసింది.

# ప్రేమ లేఖ

విశ్వం చేతలతో సమర్థుడు కాడుగాని మాటలు అనర్గళంగా మాట్లాడగలడు. విషయం కొత్తది కాకపోయినా తిరిగి తిరిగి వినాలనిపించేలా చెప్పే అతని వాక్చాతుర్యం నన్ను విపరీతంగా ఆకర్షించింది.

విశ్వం కరణం గారింట్లో ఉండటం వలన వారింటికి నా రాక పోకలు చాలా పెరిగాయి. తీరికగా ఉన్నప్పుడల్లా వాళ్లింటికి వెళ్లేవాడిని. ఉంటే విశ్వంతోను, లేకపోతే కరణంగారితోను,కరుణతోను మాట్లాడుతూ కూర్చొనే వాడిని. ఏమిటో గాని ఆ ఇంట్లో ఉన్న వాళ్లంతా నాకు అతి సన్నిహితులే.

విశ్వం పట్నం విశేషాల గురించి చాలా చెప్పేవాడు. అక్కడి రాజకీయాలూ, వింతలూ, విశేషాలూ చెప్పేవాడు. అన్ని రంగాలతోనూ కాస్త కూస్త పరిచయం ఉన్నవాడిని కావటం మూలాన ఎవరు దేని గురించి మాట్లాడినా ఉత్సాహంగా పాల్గొనే వాడిని. ప్రత్యేకించి విశ్వం ఏ విషయం చెప్పినా చాలా ఉత్సాహకరంగా చెప్పేవాడు.

ఒక నాడు అతడు తన తల్లిదండ్రుల్ని గురించి నాకు చెప్పాడు. ఆ రోజు డైరీలో బంగారు అక్షరాలతో రాసుకోవలసిన రోజు అని నా కప్పట్లో తెలీదు.

విశ్వంతో నా పరిచయం వృద్ధి అయిన కొద్దీ అతనిపై నా ప్రేమ అధికం కాసాగింది. అతన్ని విడిచి ఉండలేనంత సన్నిహితత్వం ఏర్పడింది. అతనికి ముల్లు గుచ్చుకుంటే నాకు బాధకలిగే పరిస్థితి వచ్చింది.

అయితే నన్నేకాకుండా మరో వ్యక్తిని కూడా నాకంటే గాఢంగా ఆకర్షించాడన్న సంగతి జర్పెల్ల తర్వాత గాని నాకు తెలియలేదు. బహుశా అతనికే తెలిసిఉండదు. ఆకర్షించ బడ్డ వ్యక్తి మా సంభాషణ తలుపు చాటు నుంచి విని పరవశమయ్యే కరుణ. విశ్వం విషయంలో కరుణ చూపిస్తున్న ఉత్సాహం, అతన్ని ఆమె ప్రేమిస్తోందన్న విషయాన్ని పూర్తిగా నిరూపిస్తోంది. ఆ విషయం ఆమెని స్పష్టంగా కనుక్కోవాలనుకుంటూనే వాయిదా వేస్తూ వచ్చాను.

*  *  *

ఆ రోజు ఆదివారం. నేను కరణంగారింటికి వెళ్లేటప్పటికి ఇల్లంతా బోసి పోయినట్లుంది. విశ్వం వూళ్లో లేడు. వాళ్ల వూరు వెళ్లాడట. కరణంగారు ఇంట్లో లేరు. ఇల్లంతా లేడి పిల్లలా గంతులేసే కరుణ ఒక చోట నిర్లిప్తంగా కూర్చుని ఉంది. మనిషిలో ఉత్సాహం లేదు. చాలా దిగులుగా ఉంది. పలకరించినా ఉత్సాహంగా మాట్లాడలేదు. ఆమె మనస్సు ఎటో ఉంది.

'ఏమిటమ్మా అలా ఉన్నావు ?' అన్నాను.

'ఎలా ఉన్నాను ?' అంది తలవంచుకునే.

'ఒంట్లో బాగాలేదా' అని అడిగాను.

'బాగానే ఉంది'

నాకు కాళ్లు కడుక్కోవటానికి నీళ్లు తెచ్చిన పని మనిషి చెప్పింది అమ్మాయి గారికి సంబంధం చూశారని.

నేను గతుక్కుమన్నా పైకి నా ఆరాటం తెలియనియ్యలేదు.

'శుభం. ఏవూరేమిటి ?' అన్నాను ఆశీర్వదిస్తున్నట్లు చెయ్యెత్తి.

హఠాత్తుగా తలయెత్తి చూసింది. ఆ కళ్లల్లో నీళ్లున్నాయి.

'నీకు కూడా వేళాకోళంగా ఉందా?' అంది.

'ఇందులో వేళాకోళం ఏముందమ్మా. అన లేవూరో చెప్పావు కాదు' అన్నాను.

కరుణ బాధగా తలదించుకుంది.

'మా బావంటే నా కిష్టం లేదని నీకు తెలుసు. అసలొక ఆడదాన్నంటూ పెళ్లి చేసుకునే అర్హత అతనికి లేదన్న సంగతి కూడా నీకు తెలుసు. తెలిసి, నేను విచారంలో ఉంటే వోదార్చ వలసిన నువ్వే ఇలా మాట్లాడతావా ? అంది.

నాకు అప్రయత్నంగా ఆమె భావవ్యక్తిత్వం మనోఫలకంలో మెరిసింది. నెల రోజుల క్రిందట అతను ఇక్కడికి వచ్చినప్పుడు చూశాను. ఉలూ కాని కుండేగుడ్లు, కాకిగూడులాంటి జుట్టు, సౌష్టవం లేని ఆకారం అతని బాహ్య రూపంలో కొట్టొచ్చినట్లు కనబడే లక్షణాలు, విపరీతమైన అహంకారం, నిర్లక్ష్యం, పెద్దలపట్ల అగౌరవం, సాటివారి యెడ ఈర్ష్య, అసూయ, సంస్కార విహీనమైన ప్రవర్తన— ఇవి అతని అంతర్గత రూపపు లక్షణాలు. అవలక్షణాలన్నీ పోగు చేసి ఒక రూపాన్నూహించుకుంటే ఆ రూపపు దరిదాపుల్లో కరుణ బావ ప్రభాకరాన్ని వూహించుకోవచ్చు. వెనక ఆస్తి లేక పోతే అతను ఎక్కడా చెల్లుబాటు కాడు.

'మీ నాన్నకి చెప్పావా ఇష్టం లేదని ?' అని అడిగాను.

'చెప్పాను. కాని మా నాన్న వినే స్థితిలో లేరు. ఆయనకి వాళ్ల చెల్లెలు అంటే అభిమానం. నేను పుట్టినప్పుడే మాట పుచ్చుకుందట అత్తయ్య. ఈ మధ్య సంవత్సరం క్రితం మరొకసారి అడిగారట. నాన్నగారు మాటిచ్చారు. ఆడిన మాట తప్పరు ఆయన. 'ప్రాణంకన్నా మాట విలువ ఎక్కువ అంటారు.'

'పోనీ నేను చెప్పి చూడనా ?'

'కష్టం. నీ మాట విలువ తగ్గిపోవడం తప్ప ప్రయోజనం ఉండదు. నా మీద ప్రేమకొద్దీ ఏదైనా లాభం ఉండవచ్చునన్న ఆశతో నీ మాట విలువ త్యాగం చెయ్య దలుచుకుంటే తప్పకుండా అడుగు. కాని ఫలితం ఉంటుందనుకోను' అంది.

'సరేలే తర్వాత చూద్దాం. నాన్న ఎక్కడికి వెళ్లారు ?'

'వూళ్లోకి వెళ్లారు. పురోహితుడి దగ్గరకి కావచ్చు'

లేచి వెళ్లిపోబోతూ ఆగాను.

'ఒక్క మాట అడుగుతాను ఏమీ అనుకోవు కదూ' అన్నాను

ఆమె తలెత్తి చూసింది. నా మొహం మీద చిరునవ్వు చూసి నా భావం గ్రహించి సిగ్గు పడింది. 'నిజమేనా' అని అడిగాను.

'ఏమిటి ?' అంది తలవంచుకునే.

'విశ్వం అంటే నీకు. . . .'

చిన్న చిరునవ్వు నవ్వి తలదించుకుంది.

'సరే విశ్వం వచ్చాక అతనితో మాట్లాడతాను' అన్నాను వచ్చేస్తూ.

*  *  *

విశ్వం వచ్చాడని తెలిసాక అతని రూముకి వెళ్లాను. అప్పుడు డైరీ రాస్తున్నాడు. నన్ను చూసి 'కూర్చో' అన్నాడు. 'నువ్వు రాసుకో. తర్వాత కలుస్తాలే' అన్నాను. 'ఫరవాలేదు. తరవాత రాసుకుంటాను ఉండమ'ని బలవంతపెట్టాడు.

'నేనెందుకు? ఏ సుందరి గురించి రాసుకుంటున్నావో' అన్నాను సరదాగా అంటున్నట్లు.

విశ్వం నవ్వలేదు. 'నీకు తెలుసు' అన్నాడు.

'నాకేం తెలుసు'

'మనిద్దరి మధ్య రహస్యాలు అనవసరం. సాక్షిగా మాట్లాడుకుందాం.' అన్నాడు.



"కరుణ గురించి నీ ఉద్దేశం ఏమిటి?" అన్నాను.

విశ్వం కొంతసేపు మాట్లాడలేదు. తర్వాత తను రాస్తున్న డైరీ నాకిచ్చి చూడమన్నాడు. అది చూశాక విశ్వానికి కరుణపై ఎంత అనురాగం ఉందో తెలిసింది నాకు. ప్రాణంగా ప్రేమిస్తున్నాడు ఆమెని. ఆమె లేనిది అతనికి జీవితం లేదు. ఆమె అంగీకరించక పోతే అతనికి ఆత్మహత్యే శరణ్యం.

విశ్వానికి కరుణ అవసరం చాలా మటుకు కనిపించింది నాకు. విశ్వం విశ్వంగా బతకలేడు. కరుణ అతన్ని కనిపెట్టుకుని ఉండగలదు. అతని అవసరాలు తీర్చగలదు. విశ్వం తన అవసరాలు చూసుకోలేని వాడు. కరుణ లేనిదే అతనికి రోజు గడవటం అసాధ్యం.

అతనికి ఒక్కటే లోటు. ధైర్యం సాహసం లేకపోవటం. సరిగ్గా అవే కరుణ ఎక్కువ పాళ్లల్లో భర్తీ చెయ్యగలదు. కరుణతో కలిస్తేనే విశ్వం

34 వ పేజీ చూడండి

**28-8-1964 శుక్రవారము మొదలు**
**3-9-1964 గురువారము వరకు.**

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | చం | గు | కు శు రా |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | ర బు |
| కే | | | |

**సూచన**

నూతన వ్యవహారాలు ప్రారంభించడానికి, ముఖ్యమైన నిర్ణయాలు చేయడానికి మంచివి అని వ్రాసిన తేదీలు అనుకూలంగా ఉంటాయి. మంచివి కాని తేదీల్లో అననుకూలమైన సంఘటనలు జరగడానికి అవకాశం ఉంది. కాబట్టి జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం.

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈ వారం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను అన్ని వ్యవహారాల్లోనూ అనుకూలత లభిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో కొంతమంది ప్రముఖ వ్యక్తుల సహాయం లభించవచ్చును. వృత్తిలో సాటివారితో పోటీ కొంచెం తగ్గుతుంది. ఉద్యోగంకూడా బాగానే ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లోమాత్రం ప్రతికూలత పెరగవచ్చును. బంధువుల వ్యవహారాల్లో ప్రయోజనంలేని ప్రయాణాలు చేస్తారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాలలో కొంచెం శ్రమమీద విజయాన్ని సాధిస్తారు. స్నేహితులతో అకారణంగా అభిప్రాయభేదాలు రావచ్చును.

స్త్రీలకు —ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

30 31 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.

ఈ వారం మీరు ఏ వ్యవహారంలోను విశేషమైన ప్రయోజనాన్ని సాధించలేకపోవచ్చును. కాని ముందు ముందు వృత్తి వ్యాపారాల్లో యోగించుటకు అనువైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఆర్థిక వ్యవహారాలుమాత్రం ఇంకా సర్దుబాటు కాకపోవచ్చును. డబ్బు విషయంలో ఇతరులను నమ్మి వ్యవహరించడం మంచిదికాదు. అధికారులవలన జరగవలసిన పనులు సులభంగా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. శుభమూలంగా వ్యయం జరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ఎదురుచూడని ప్రోత్సాహం లభిస్తుంది.

స్త్రీలకు —ఆరోగ్యం వారం మధ్యనుంచి బాగా ఉంటుంది. కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. 30, 31 తేదీలు మంచివి. 28, 29 తేదీలు మంచివికావు.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

ఈ వారం ప్రారంభంలో అనుకూలంగా కన్పించినా, రానురాను అన్ని వ్యవహారాల్లోనూ, చికాకులు కలగవచ్చును. మీరు ఎన్నో శ్రమలకు గురి అయి ఇప్పటికీ ఒకదారికి తెచ్చిన వ్యవహారాలుకూడా మరల మొదటికి రాగల ప్రమాదం ఉంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. వృత్తి వ్యాపారాల్లో మార్పులకోసం ప్రయత్నించేయడానికి సమయంకాదు. ఉద్యోగంలోకూడా వ్యతిరేక వాతావరణం ఏర్పడడంవలన, మనశ్శాంతి లభించదు. ఆరోగ్యంకూడా అంత బాగా ఉండదు. ముఖ్యమైన కార్యక్రమాలు వాయిదా వేయడం మంచిది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాహిత్యరంగంలో ఖ్యాతి లభిస్తుంది. శుభమూలంగా అధిక వ్యయం జరుగుతుంది.

28, 29 తేదీలు మంచివి. 30, 31 తేదీలు మంచివికావు.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

అనుక్షణమూ, అప్రమత్తతగా ఉండవలసిన సమయం వృత్తి వ్యాపారాల్లో కొన్ని వ్యవహారాలు మీ స్వాధీనంనుంచి తప్పిపోయే ప్రమాదం ఉంది. నూతనవ్యవహారాల్లో ఆదాయం పెరగవచ్చునుకాని, ఇతర వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులవల్ల సంతృప్తికరంగా ఉండదు. వారం మధ్యలో కొన్ని అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో ప్రతి వ్యవహారం స్వయంగా చూడటం మంచిది. నమ్మించి మోసంచేయడానికి ప్రయత్నించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు —ఆరోగ్యం గత వారంలోకంటే బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం సంతోషం, లభిస్తాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

30, 31, 3 తేదీలు మంచివి. 1, 2, తేదీలు మంచివికావు.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో కొంచెం శ్రమపెరిగినా అన్ని వ్యవహారాలు మీరు అనుకున్నట్లుగా సాగుతాయి. వ్యాపారానికి సంబంధించిన అనుకూల వార్తలు వింటారు. నూతన వ్యవహారాలు అంతగా రాణించలేకపోవచ్చును. వృత్తిలో ఇంతవరకు ఉన్న పోటీ తగ్గుతుంది. కాని మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు ప్రాముఖ్యత రావడం వలన మీరు పొందవలసిన లాభాన్ని పొందలేకపోవచ్చును. ఉద్యోగంలో మీ అభిప్రాయాలను అమలుజరపడానికి అవకాశం లభించడంవలన మీ శక్తిసామర్థ్యాలు రుజువు కాగలవు. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు —ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సులభంగా నెరవేరతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

3వ తేది మంచిదికాదు. మిగిలినవి మంచివి.

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో ఈ వారం అవస్థ మీది, అనుభవం మరొకరిది అయ్యే పరిస్థితి ఏర్పడవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రారంభించడానికి సమయంకాదు. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ఆదాయం మామూలుగా ఉన్నా వ్యయం పెరిగే సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో కార్యభారం ప్రయోజనంలేని ప్రయాణాలు చేయవలసి వస్తుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కాని వారారంభంలో మానసికాందోళన కలగవచ్చును.

స్త్రీలకు —ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. బంధువుల వ్యవహారాల్లో విస్మారం రావచ్చును. విలువైన వస్తువులు కొంటారు.

28, 29 తేదీలు చెడ్డవి. మిగిలినవి మంచివి.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా.)

వృత్తి వ్యాపారాల్లో కార్యభారం పెరగవచ్చును. కాని వారాంతంలో అన్ని వ్యవహారాల్లోనూ అనుకూల పరిణామాలు ఏర్పడతాయి. ఆర్థికంగా అప్పుడప్పుడు ఒత్తిడి వచ్చినా, మిత్రుల సహాయం వలన ఇబ్బందిలేకుండా అన్ని వ్యవహారాలూ నెరవేరుతాయి. వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచన వల్ల సాటి వారిలో గౌరవాన్ని పొందగలరు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు, అధికారుల ఆదరణా పొందగలరు. ఇంతవరకూ చికాకులతో ఉన్న బంధువుల వ్యవహారాలను పరిష్కరించగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు —ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు. కుటుంబంలో స్వల్ప భేదాభిప్రాయాలు రావచ్చును.

1, 2 తేదీలు మంచివి. 30, 31 తేదీలు చెడ్డవి.

### వృశ్చికం (

(విశాఖ 4—వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీరు ప్రతి వ్యవహారమూ ఆదర్శవంతంగా నెరవేర్చాలని ప్రయత్నించడంవలన కొన్ని వ్యయప్రయాసలకు గురి కాగలరు. ముందు ముందు వృత్తి వ్యాపారాల్లో యోగించుటకు అవసరమైన మార్పుల

మీచిత్తం మీరుచేసే కృషి ఫలించగల సూచనలు ఉన్నాయి. భాగస్వాములతో కొన్ని భేదాభిప్రాయాలు రావచ్చును. గాని వాటివల్ల ముఖ్య కార్యక్రమాలు ఆగిపోవు. వృత్తి ఉద్యోగాల్లో గౌరవం పెరుగుతుంది. ప్రయోజనకరమైన పరిచయాలు ఏర్పడతాయి. ఆరోగ్యం అంత బాగా ఉండకపోవచ్చును. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు కార్యరూపం ధరించవచ్చును.

స్త్రీలకు —అనారోగ్య సూచనలున్నాయి. బంధుమిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

30, 31, 3 తేదీలు మంచివి. మిగిలినవి మంచివి కావు.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వృత్తి వ్యాపారాల్లో పరిస్థితి పైకి ప్రశాంతంగా కన్పించినా, మీరు ఏమాత్రం ఏమరుపాటు చూపినా నష్టం తప్పదు. భారీయెత్తున చేసే వ్యాపారాలు కొంత కాలంపాటు వాయిదా వేయడం మంచిది. స్నేహితులతో మాట పట్టింపులు రాగల సూచనలు ఉన్నాయి. సాధ్యమైనంత వరకు మౌనంగా ఉండడం మంచిది. వృత్తి ఉద్యోగాల్లో మార్పులకోసం చేసే ప్రయత్నాలు ఫలించక పోవచ్చును, ఇతరులు చేసిన పొరబాట్లకు కూడా మీరే బాధ్యత వహించగలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం.

స్త్రీలకు —ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొన్ని చికాకులు రావచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

30, 31, 3 తేదీలు మంచివికావు. మిగిలినవి మంచివి.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఈ వారం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఏర్పడిన అవరోధాలను క్రమంగా తొలగించుకుంటూ అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో నూతన వ్యక్తులతో పరిచయం కలుగుతుంది. ఆదాయంకూడా పెరగడానికి అవకాశం ఉంది. ఉద్యోగంలో మీ ఆలోచనలు అమలుజరపడానికి అవకాశం లభిస్తుంది. బంధుమిత్రుల వ్యవహారాల్లో మీరు చిక్కుకొనే సూచనలు ఉన్నాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావచ్చును.

స్త్రీలకు —ఆరోగ్యం బాగానే ఉంటుంది. నూతన విషయాలు తెల్సుకుంటారు. ఇతరులతో అనవసరమైన మాటపట్టింపులు రావచ్చును.

1, 2 తేదీలుమంచివికావు. మిగిలినవి మంచివి.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3)

అన్ని వ్యవహారాల్లోనూ వారారంభంలో కనిపించిన అనుకూలం వారాంతానికి నిలబడకపోవచ్చును.

వృత్తి వ్యాపారాల్లో మీరు ప్రారంభించిన పనులు పూర్తిగా నెరవేరేవరకు నమ్మడానికి వీలులేదు. డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు ఇప్పుడు చేయడం వలన మున్ముందు ఇబ్బందులకు గురికాగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాల్లో మార్పులు రావు కాని కొంతమంది వ్యక్తులు మీ ఎదుట స్తోత్రం చేస్తూ చాటున నిందించడానికి పూనుకుంటారు. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు — ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు చిన్న మార్పులతో నెరవేరతాయి బంధువులకు సహాయం చేస్తారు.

1, 2 తేదీలు మంచివి. 3 వ తేదీ మంచిది కాదు.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

గత వారం కంటే ఈ వారం బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించవు. కాని ఇప్పటికే ఉన్న వ్యవహారాలు సంతృప్తికరంగా నెరవేరతాయిడానికి అవకాశం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు స్నేహితుల సహకారం లభించవచ్చును. ఆర్థిక వ్యవరాహారాల్లో ఏర్పడిన చికాకులు కూడా తగ్గుముఖం పడతాయి. ఉద్యోగంలో మార్పుల కోసం ప్రయత్నం చేయవచ్చును. కోర్టు వ్యవహారాల్లో ఆకస్మికంగా అనుకూలమైన మార్పులు రావచ్చును. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది.

28, 29, 3 తేదీలు మంచివి. మిగిలినవి సాధారణం. ★

# జన్మదినఫలం

## ఆగస్టు-28

ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. మీరు ఇంతవరకు ఊహించని వ్యాపారాలు కొన్ని ఈ సంవత్సరంలో చేసి లాభాన్ని పొందుతారు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో సమయానికి డబ్బు ఏదో ఒక రూపంలో అందడంవలన ఇబ్బంది కన్పించదు. ఆదాయం కూడా పెరుగుతుంది. ఉద్యోగంలో పై అధికారులతో అభిప్రాయభేదాలు వచ్చినా మీ అభిప్రాయాలే సరియైనవని రుజువు కావడంవలన యుతోధికమైన గౌరవాన్ని పొందతారు. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. అన్ని వ్యవహారాల్లోను ముందడుగు వేయవలసిన సమయం. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## ఆగస్టు-29

ఈ సంవత్సరం గడచిన కొద్ది సంవత్సరాలకంటే బాగా ఉంటుంది. మీ భవిష్యభివృద్ధికి తోడ్పడే దీర్ఘకాలిక ప్రణాళికలు అమలుజరపడానికి అనువైన సమయం. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నం లేకుండానే కొన్ని మార్పులు వచ్చి మీ అభివృద్ధికి తోడ్పడగల సూచనలు ఉన్నాయి. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు బాగా అనుకూలంగా ఉంటాయి. వృత్తికి సంబంధించిన విద్యలో ఉత్తీర్ణులు కాగలరు. ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించవచ్చును ఆరోగ్యం బాగావుంటుంది. కుటుంబ వ్యవహారాలుకూడా సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో బాధ్యతగల పదవిని నిర్వహించగల సూచనలు ఉన్నాయి. ఇటువంటి అనుకూల్యమైన సమయంలో అనవసరమైన వ్యవహారాల్లో మీరు చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది. విద్యార్థులకు క్షేమ రావచ్చును.

## ఆగస్టు-30

జీవితంలో ఇటువంటి సంవత్సరాలు చాలా అరుదుగామాత్రం వస్తూ ఉంటాయి. ఈ సంవత్సరం మీరు జరిపే వ్యవహారాల్లో కేవలం ధన లాభమేకాకుండా విజయాన్ని సాధించామనే సంతృప్తి కూడా లభిస్తుంది. ఇప్పుడు జరగబోయే సంఘటనలు జీవిత మార్గాన్నే మార్చగలిగిన బలం కలిగి ఉండవచ్చును. సాధ్యం కాదని ఇంతవరకు మీరు నిరాశ చెందిన వ్యవహారాలుకూడా నెరవేరగల సూచనలు ఉన్నాయి. వృత్తి ఉద్యోగాలలో మీకు అనుకూలంగా ముఖ్యమైన మార్పులు వస్తాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మాత్రం ఇంకా పూర్తిగా చక్కబడవు. సాహిత్య కళారంగాల్లో నూతన గౌరవం లభించవచ్చును. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యతా, బాధ్యతాకూడా పెరుగుతాయి. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. పారిశ్రామిక వేత్తలకు రాజకీయ నాయకులకు మంచిసమయం.

## ఆగస్టు-31

ఈ సంవత్సరం అంత బాగా ఉండకపోవచ్చును. వృత్తి వ్యాపారాల్లో ప్రతికూల వాతావరణం ఏర్పడుతుంది. సామాన్య వ్యవహారాలకు కూడా విశేషమైన వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. కొన్ని వ్యవహారాల్లో చికాకులు రావడంవలన మీ బాకీలు డబ్బు వాటిలో చిక్కుబడిపోయే ప్రమాదం ఉంది. కొన్ని వ్యవహారాల్లో కోర్టు వరకు వెళ్లవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలను ప్రారంభించడం మంచిదికాదు. ఉద్యోగంలో ఇంతవరకు మిమ్మల్ని ఆదరించినవారు కూడా మీపట్ల తటస్థంగా ఉండిపోతారు. ఉద్యోగంలో మార్పులకోసం ప్రయత్నం చేయడానికి సమయం కాదు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులకు సంబంధించిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలు కార్యరూపం ధరిస్తాయి. శుభ మూలంగా వ్యయం జరుగుతుంది.

## సెప్టెంబరు-1

ఈ సంవత్సరం మొత్తంమీద సంతృప్తికరంగా ఉండవచ్చును. వృత్తి వ్యాపారాల్లో కొన్ని చికాకులు వచ్చేటట్లు కన్పిస్తాయి గాని వాటివల్ల మీ మీ కార్యక్రమాలకు భంగము కలుగదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో కూడా లాభం రాగల సూచన లున్నాయి. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయం లభిస్తుంది. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. రావలసినడబ్బు సకాలానికి అందుతుంది కాని అనవసరమైన వ్యయం జరిగే సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యుదాతథంగా ఉంటాయి గాని, ఆత్మీయులతోనే స్వల్ప అభిప్రాయభేదాలు రావచ్చును. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో బాధ్యత వహిస్తారు. తీర్థయాత్రలు, పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-2

ఈ సంవత్సరం అనవసరమైన ఆర్భాటం హడావిడీ తప్ప ప్రయోజనం అంతగా ఉండకపోవచ్చును. వృత్తి వ్యాపారాల్లో ఎన్నో అవకాశాలు కన్పించినా ఫలితం చేతికి వచ్చేవరకూ దేనినీ నమ్మడానికి అవకాశంలేదు. సంవత్సరం మధ్యలో మీకు సన్నిహితంగా ఉన్నవారే కొంతమంది మోసం చేయడానికి ప్రయత్నం చేయడంవలన మీవారెవరో పైవారెవరో తెలియని పరిస్థితి ఏర్పడుతుంది. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని వ్యవహారాలు నిలిచిపోవచ్చును. ఉద్యోగ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. ఏ వ్యవహారం ఎలా ఉన్నా ఆర్థికంగా నష్టం వచ్చే సూచనలు లేవు. ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని మానసికాందోళన అప్పుడప్పుడు కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో అభివృద్ధి ఉంటుంది. ప్రేమ వ్యవహారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కాగలరు.

## సెప్టెంబరు-3

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులు రావు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రావచ్చును. మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. మీరు ఇదివరకు చేసిన వాగ్దానాల వల్ల సంవత్సరం మధ్యలో ఆర్థికంగా ఇబ్బంది రావచ్చును. భారీ వ్యాపారాలు చేయడానికి సమయంకాదు. ఉద్యోగంలో మీ పరిస్థితి గుంభనంగా ఉంటుంది గాని సంవత్సరం రెండవ భాగంలో కొంచెం అనుకూల పరిస్థితి ఏర్పడుతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబంలో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. బంధువులకు సంబంధించిన వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు. రాజకీయ వ్యవహారాల్లో సంపద్యోగం లేకపోయినా ఒక కీర్తి ఉంటుంది. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు. ★

# వాడిన కుసుమాలు

హరికిషన్



### జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాధను చెపుతూవుంటుంది... జానకి, సీత అక్కచెల్లెళ్ళు. జానకీ రామారావుంకు పెళ్లవుతుంది. జానకికీ, చనిపోయిన చినమామయ్యకీ సంబంధం వుందన్న కోపంతో రామారావు ఆమెను చిన్నచూపు చూస్తాడు.

## 3

రాత్రి పన్నెండు గంటలు దాటాక సీత నర్సింగ్ హోమ్ నుంచి వచ్చింది. అంత వరకూ రాధ ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చుంది.

" నువ్వింకా నిద్ర పో లేదా రాధా." అన్నది సీత.

" లేదు. ఎట్లా ఉందాకేసు."

" సక్సెస్ ఫుల్‌గానే తాను పంయింది. ఏమిటో ఈ కొన్ని కేసులు చూస్తుంటే ఒక్కోసారి మానవ జీవితం వ్యర్థమనే అనిపిస్తుంది. కొంతమందికి నిజంగా పురుడు పునర్జన్మగానే ఉంటుంది.' అన్నది సీత.

రాధ నవ్వింది.

" నీలాంటి వాళ్ళు ఉండగా పురుడు పోసుకునే వాళ్లకు ఏ కొరతా ఉండదు " అన్నది రాధ.

సీత ఏం మాట్లాడలేదు.

" నాకు నిద్ర రావటం లేదు సీతా. మిగతా వన్ని పూర్తి చేస్తావా ? "

" నాకు బడలికగా ఉంది. కాస్త విశ్రాంతి తీసుకోనియ్యి. మిగతా విషయాలు రేపు చెబుతాను ' అన్నది సీత.

మర్నాడు ఆదివారం. రాధకు హాస్పిటల్ డ్యూటీ లేదు. సీత నర్సింగ్ హోమ్‌కు వెళ్లింది. అందర్నీ చూసి ఎవరికి ఏ మందులు ఇవ్వాలో నర్సులకు చెప్పి తను ఇంటికి వచ్చేసింది. సీత రాకకు రాధ ఎదురు చూస్తున్నది.

సీత నవ్వింది.

" మా జీవిత కథ అంత విన సొంపుగా ఉన్నదా రాధా ? "

" కథ అనేది వినసొంపుగా ఉంటుంది. జీవిత కథ లయితే అందులో ఒక పాత్రగా మనమూ లీనమై పోతాం. అది కథ కాదు. ఒక జీవితగాథ." అన్నది రాధ.

" అక్కయ్య మళ్లా ఇట్లా చెప్పింది." ——

" సీతా! జీవిత సమస్యల్ని పరిష్కరించుకో టానికి పెద్ద మనుష్యుల సాయం కొన్ని విషయాల్లో అవసరమే. కోర్టు సాక్ష్యాలూ, వ్రాత పూర్వక మైన ఆధారాలు కొంతమందికి అవసరం. వచ్చిన అపవాదు తను పోగొట్టుకోటానిక్కూడా ఇతరుల సాయం కొన్ని విషయాల్లో అవసరమే. కాని సీతా ! నా విషయంలో మాత్రం ఎవరి సాయం పొందటానికే వీల్లేదు. అపవాదు భరించినా చిన్న మామయ్య ఈ లోకంలో లేడు. మరి నాకు ఎవ్వరు సాయ పడతారు ? " అన్నది అక్కయ్య.

'' అవును నీ అపవాదును చర్చించి నిన్ను నిర్దోషిగా ఋజావు చెయ్యటానికి ఎవ్వరూ లేరు. బావ మనస్సులో ఏ దేవుడన్నా ప్రవేశించి వారి మనసు మార్చ వలసిందే '' అన్నాను.

అక్కయ్య కళ్లలో నీరు తిరిగింది.

'' అంత పుణ్యాత్మురాలివా సీతానేను. కరుడు కట్టిన వారి మనస్సుమారతుందా. నాకు నమ్మకం లేదు '' అన్నది అక్కయ్య.

'' నా మనస్సు ఎంతో వికలమై పోయింది.'' సీత ఒక్కసారి నిట్టూర్చింది.

'' సరే తరువాత '' అన్నది రాధ.

సీత మళ్లీ చెప్ప సాగింది. —

'' కొన్ని క్షణాలు కళ్లు మూసు కుని మళ్లా అక్కయ్య ఇట్లా చెప్ప సాగింది.'' —

'' సీతా! మీ బావ చిన్నమావయ్య మీద అట్లా అనుమాన పడ్డారు కదా. నువ్వు మూణ్ణిద్రలకు నాతో గుంటూరు వచ్చావుగా. వారట్లా అర్థం చేసుకునే రీతిగా చిన్న మావయ్య ఏం మాట్లాడాడో నువ్వు చెప్పవే '' అన్నది అక్కయ్య.

కాస్సేపు జరిగిన విషయాలు గుర్తుకు తెచ్చు కున్నాను.

'' మొదటి రోజున చిన్న మావయ్య అక్కడికి వచ్చాడు. అప్పుడు నువ్వు గదిలో ఉంటే నేపిల్చు కొచ్చా నిన్ను. కుశల ప్రశ్నలయ్యాక చిన్న మావయ్య సర్దాగా ఏవో కబుర్లు చెప్పాడు. అప్పుడు బావ కూడా అక్కడే ఉన్నారు. చిన్న మావయ్య మాటల్లో అపార్థాలకు గాని, అనుమానా లకు గాని, ఏమీ ఆస్కారం కనిపించదు. కాక పోయినా చిన్న మావయ్య ప్రభావం అందరికీ తెల్సు కదా! అంత ఉత్తముడూ, దయార్ద్ర హృదయుడూ, బంధువులంటే ఆదరాభిమానాలు కలవాడూ మన చుట్టాల్లో ఎవ్వరూ లేరు. అందర్నీ కవ్వించి, నవ్విస్తూ, నవ్వుతూ సంతోషంగా మాట్లాడు తాడు. అత్తయ్య కూడా మావయ్యకు తగిన భార్య, వారి దాంపత్యం చూడ ముచ్చటగా ఉంటుందని మన చుట్టాలంతా అనుకుంటారు. అటువంటి సంసారంలో చిచ్చు పెట్టాడు భగ వంతుడు. అంత మంచి పేరు తెచ్చుకున్నవాళ్లు అల్పాయుష్కులుగానే పోతారేమో.'' అన్నాను నేను.

'' అవును కదా. అటువంటి సహృదయుడైన చిన్న మావయ్య నన్ను చూట్టానికి వస్తే నేను ఎట్లా మాట్లాడకుండా ఉండేది చెప్పు సీతా, కాక పోయినా నిన్నటి వరకూ ఎంతో ఆప్యాయంగా మాట్లాడిన చిన్న మావయ్యతో, ఒక్కసారిగా పెళ్ల యిందని ఎట్లా మాట్లాట్టం మానెయ్యాలో ఆలో చించు. అటువంటి మావయ్యతో నాకు సంబంధం ఉందని వారు అనుమాన పడ్డారంటే నా మనస్సు ఎంత కుమిలి పోతున్నదో ఆలోచించు. పైగా చిన్న మావయ్య మీ బావగారి స్నేహితుడే. మావయ్య మనస్తత్వం వారికి మాత్రం తెలీదూ. తెల్సినా వారికే అనుమానం కలిగిందంటే ఏం చెప్పాలో నాకు తల పగలగొట్టుకున్నా తెలియటం లేదు. మావయ్య బతికుంటే తన జీవితాన్ని త్యాగం చేసయినా వారి మనస్సులో గల ఆ అనుమానాన్ని తీర్చేవాడే. మనందరి దురదృష్టవశాత్తు చిన్న మావయ్య ఈ లోకంలో లేడు.'' అన్నది అక్కయ్య.

'' బావ అంత సంకుచిత హృదయుడన్నట్టు తరవాత '' అన్నాను. ''సీతా, ఈ సంగతులన్నీ ఇప్పుడు నే చెప్పేటంత వరకూ ఎవ్వరికీ తెలియవు కదా. నేను కాపురానికి వెళ్లాక నన్ను గురించి ఏమను కున్నావే.'' అన్నది అక్కయ్య.

'' ఏమనుకుంటానే, నువ్వు అదృష్టవంతురాలి వనుకున్నాను. బావ సహృదయుడని, అనుకున్నాను. నిన్ను ఎంతో ఆపేక్షగా చూసుకుంటూ పువ్వుల్లో పెట్టి పూజిస్తారనుకున్నాను. నీ మంచితనం, తెలివి తేటలూ బావను ఆకర్షిస్తయ్యనుకున్నాను. నాన్న పొలమంతా అమ్మి పెళ్లి చేసినా మంచి సంబంధమే చేశారనుకున్నాను. అంతకు మించి నేనేమీ అనుకో లేదు '' అన్నాను.

'' అవునే సీతా, నువ్వేకాదు. అంతా అట్లాగే అనుకున్నారు. కొందరి జీవితాలు పైకి సంతోషం గానే ఉన్నట్లుగా కనబడుతయ్యి. కాని లోపల అగ్ని పర్వతం ప్రజ్వరిల్లి బద్దలవుతుంది. కొంతమంది పైకి కష్టపడుతున్నట్లుగా కనిపించినా ఎంతో ఆదర్శ దంపతుల్లా సంసార జీవితాన్ని గడుపుతారు. అది వాళ్ల మనస్తత్వాన్ని బట్టి, ఒకరియందు మరొకరి కుండే అనురాగాన్ని బట్టి ఉంటుంది సరే మీరంతా వెళ్లాక, చుట్టాలంతా వెళ్లాక, ఇంక ఆ ఇంట్లో మిగిలింది మా అత్తగారూ, మావగారూ, సుభద్రా, మేమిద్దరమూ, అంతా వెళ్లాక నెమ్మది మీద వారిని అన్ని విషయాలు అడుగుదామనుకున్నాను.'' అన్నది అక్కయ్య

ఎందుకనో నావైపు నిరాశగా చూసింది అక్కయ్య. మాట్లాడుతూ ఎందుకట్లా ఆగి పోయిందో నాకు అర్థం కాలేదు. చూస్తూండగానే కన్నీరు పెట్టుకుంది. కొత్త విషయం ఏమయినా చెపుతుందేమో అనుకున్నాను.

'' పెళ్లిలో చిన్న మావయ్య నాకు రిస్టువాచీ చదివించాడు. గుర్తుందిగా సీతా.''

'' అవును గుర్తుంది. ఆవాచీ బాగా పని చేస్తు న్నదా ? ''

'' హుఁ. వారికి నామీద ఈ అనుమానం కలిగినప్పట్నించి ఆ వాచీ నాపెట్లో అడుగు దాచేశాను. ఒకసారి ' కీ ' ఆన్నా ఇవ్వలేదు. ఒకసారి టైము కావాల్సి మీ బావను టైమెంతయిందండీ అని అడిగాను. అందుకు బావ ఏమన్నారో తెలుసా. మీ ప్రియమైన చిన్న మావయ్య ప్రెజెంటు చేసిన రిస్టువాచీ ఉన్నదిగా. అది చేతికి పెట్టుకు తిరుగు. టైం చూసుకోవచ్చు. అన్నారు. ఆ మాటలు నాకు సూలాల్లా తగిలాయి. ఛీ, ఇంతమాట అనిపించుకున్నాక, చదివించిన మావయ్య పోయాక ఈ గడియారం నా కాపురాన్ని ఏవిధం గానూ నిలబెట్ట లేదనుకుని వారు చూస్తూండ గానే ఆ గడియారాన్ని వీధిలో సైడు కాలవలో పారేశాను.'' అన్నది.

'' నిజంగానా జానకీ. మూటఏభై రూపాయ లయిందిట ఆ గడియారం '' అన్నాను ఆదుర్దాగా.

'' అవునే సీతా, అంత అపవాదు నెత్తిన వేసుకుని జీవచ్ఛవంలా జీవిస్తున్నది చాలక, ఇంక ఆ గడి యారం చేతికి పెట్టుకు తిరగమంటావా. చెప్పు. మావనత్వంలోపించిన వారి మనస్సులో ఆ గడియారం ఇంకా దావానలాన్ని పెంచవచ్చు. అందుకే ఆ గడి యారాన్ని పారేశాను. ఆ రోజున చిన్న మావయ్యను నేనే గొంతు పిసికి చంపినట్టుగా బాధ పడ్డాను. ఆప్యాయంగా నాకిచ్చి హృదయంతో చదివించిన ఆ గడియారాన్ని బురద గుంట పాలు జేసాను. నే చేసిన పనికి చిన్న మావయ్య ఆత్మ ఎంత క్షోభిల్లిందో '' అన్నది.

ఈ మాటలు విని నేను మాట్లాడలేక పోయాను.

అక్కయ్య కాపురం ఈ తీరుగా ఉన్నందుకు ఎంతో బాధ పడ్డాను. అక్కయ్య మళ్లీ చెప్పసాగింది.

'' ఏదో ముభావకంగా, భార్యా భర్తలం కనుక నాతో ఉంటమే తప్ప, కొత్త దంపతుల్లో ఉండ వలసిన కోరికలు గాని, అనుభూతులు గాని, అభి రుచులు గాని వారిలో ఎక్కడా కనబడలేదు. ఏం అడిగినా మాట్లాడరు. ఉదయం లేవగానే కాల కృత్యాలు తీర్చుకుని, కాలేజీ పుస్తకాలు చదు కోటం, నోట్సు రాసుకోటం, భోజనం చేసి కాలేజీకి వెళ్లటం. సాయంత్రం అయిదు గంటలకు రాగానే, స్నానం చేసి కాఫీ ఫలహారం చేసి ఎక్కడికో వెళ్లి పోవటం. రాత్రి తొమ్మిది దాటగానే ఇంటికి రావటం. నావల్ల ఏ లోపముందని ఎవరితో చెప్ప కోను ? ఏమని చెప్పను ? ఎట్లా చెప్పను ? మా అత్తగారు అదో రకం మనిషి. ఎవరితోనూ కలుపుగోలు తనంగా మాట్లాడదు. పోనీ కోడల్ని కనక కోపమా అంటే, అదీ కాదు. ఆవిడకు తోచిన పన్లు చెయ్యటం. లేకపోతే చెంగు పరుచుకుని పడుకోవటం. మాటా, పలుకూ, ఏమీలేదు. ఆవిడ స్వభావమే అంత. మా మావగారు దేవుడు. ఆయనకు వేళకు ఇంత భోజనం పెడితే చాలు. ఆయనా రిజిష్ట్రారు ఆఫీసులో గుమాస్తా. ఇంకా రెండేళ్ళు మాత్రం సర్వీసుంది. ఆయన ఆఫీసు గొడవలూ, భోజనమూ మినహా ఏమీ పట్టించు కోరు. ఇంక మా ఆడబిడ్డ సుభద్ర తెలుసుగా ? పదహారేళ్లు దాటినా, పెద్ద పిల్లయినా పదేళ్ల పిల్లలా ఉంటుంది. వయస్సుకు తగిన భావాలు గాని, సిగ్గూ బిడియాలు గాని తెలియవు. కొంచెం వెకిలి తనమూ ఉంది. ఎంతో తెల్సిందానిలా, ఎంతో హుందా తనంగా, ఎంతో ధీమాగా, గొప్పగా ఉండాలనుకుంటుంది. కాని ఏం లాభం. నిమిషం లోకి తన తెలివి తక్కువ తనాన్ని బయట పెట్టు కుంటుంది. ఆ పిల్ల నీకూ పరిచయమేగా. కనీసం నీతో వందసార్లయినా మాట్లాడి ఉంటుంది అవునా '' అన్నది అక్కయ్య.

*　　*　　*

'' వింటున్నావా రాధా. అక్కయ్య జీవితం ఒక సినిమా కథ లాంటిది. అందులో హాస్యపాత్ర సుభద్ర. సుభద్ర స్కూలు ఫైనలు పాసయింది. అక్కయ్యతో వాళ్లింటికి వెళ్లిన మూడు రోజు ల్లోనూ ఆ అమ్మాయి వాలకం చూస్తూంటే నాకు నవ్వొచ్చేది రాధా'' అన్నది సీత రాధతో నవ్వుతూ.

'' ఏం. వెర్రిబాగులదా ? అట్లయితే స్కూలు ఫైనలు ఎట్లా పాసయింది.'' అన్నది రాధ.

'' చదువుకీ లోకజ్ఞానానికీ కొంతమంది విషయంలో సంబంధం లేదు రాధా. అక్కయ్య పెళ్లిలో ఒక సంఘటన తల్చుకుంటే నాకు ఇప్ప టికీ నవ్వు వస్తుందే రాధా.'' అన్నది సీత.

'' ఏమిటమ్మా అంత నవ్వు వచ్చే సంగతి '' అన్నది రాధ.

'' అక్కయ్య పెళ్లిలో పళ్లు దోము పుల్లలక్క

## హృదయ కుసుమాలు

వెళ్ళాము. అమ్మ, పిన్ని, నేనూ విడిదికి మేళంతో వెళ్ళాము. అప్పటికి ఉదయం తొమ్మిది గంట లయింది. అంతా స్నానాలు చేసి ముస్తాబు అయి మేం వస్తామని కూర్చున్నారు. తీరా పీటల మీద పళ్ళ దోము పుల్లలకి కూర్చోపెట్టేసరికి సుభద్ర పేచీ పెట్టింది. పళ్ళ దోము పుల్లలంటే ఏదో నాటుక గీసేసినట్లు గీసి ఒక చీరపెట్టి వెళ్ళిపోవటం కాదు. నాకు ఒక్కగానొక్క అన్నయ్య. నేనూ ఒక్కగానొక్క ఆడబడుచుని. మామూలు ప్యాకెట్లూ లాంఛనాలతో బాటుగా నాకు ఓ డజను టూత్ పేస్టు ప్యాకెట్లు, ఒక వెండి బ్రష్, వెండి తాటాకు కావాలి. అవి తెస్తేనే పీటలమీద నుంచి లేస్తాను. లేకపోతే అలుగుతాను. అన్నది. ఆ సమయంలో అట్లాంటి అర్థంలేని పేచీలు పెట్టినందుకు అందరికీ కోపమూ, నవ్వూ కలిగినయ్యి. చివరికి నేనే సుభద్రను సమాధానపర్చి, "అవన్నీ, ఆ లాంఛనాలన్నీ మాకు తెలీదండి, మా ఇంట ఆనవాయితీ లేదు. మీకు టూత్‌పేస్టులు పుచ్చు కోవటం ఆనవాయితీ అయితే డబ్బిస్తాం కొను క్కోండి" అని నేను వెళ్ళి నాన్నగార్నడిగి ఓ పాతిక రూపాయలు తెచ్చి సుభద్ర చేతిలో పెట్టాను. అప్పటికి గాని సుభద్ర ముఖం తేట పడలేదు." అన్నది సీత.

ఇదంతా విని రాధ నవ్వింది. "సీతా, సీరియస్‌గా ఉండే సినిమాలో రిలీఫ్ కోసమని హాస్యపాత్రల్ని ప్రవేశ పెట్టినట్లుగా ఉంది సుభద్ర కథ. అయితే సుభద్ర అంత తెలివి కలదన్నమాట" అన్నది రాధ.

"అప్పటి పరిస్థితులు అవి. ఇప్పుడంటావా. మనబోటి వాళ్ళకి పదిమందికి చెబుతుంది సుభద్ర." అన్నది సీత.

"పోనీలే బ్రతికి పోయాం. ఇంక అసలు విష యము చెప్పు." అన్నది రాధ.

సీత మళ్ళా చెప్ప సాగింది. —

"సుభద్ర మనస్తత్వం తెల్సిందిగా సీతా, అట్లాంటి సుభద్ర అన్నమానం నాతో అర్థం పర్థం లేని ఎగతాళి మాటలు మొదలు పెట్టింది." అన్నది అక్కయ్య.

"ఏమనేదేం" అన్నాను సుభద్రను తల్చుకుని నవ్వుతూ.

"వదినా, నువ్వు చదువుకున్న దానివే కదా, నాకు తెలీక అడుగుతాను. నువ్వూ అన్నయ్య పాదా లకు నమస్కరిస్తావా. మంగళ సూత్రాలు కళ్ళ కద్దుకుని పడుకుంటావా అని అడిగింది సుభద్ర"

"ఏమన్నావేం ఆ మాటకి" అనడిగాను.

"అసలే మతి పోయి నేచున్నంటే సుభద్ర తెల్సీ తెలియని మాటలకి నవ్వాలో ఏడవాలో నాకు తెలియలేదు. సుభద్ర, అవన్నీ నాకు తెలియవు మీ అన్నయ్య నడుగు. వారేం అన్నదీ నాకు చెప్పు.' అన్నాను. ఆరోజు సాయంత్రమే సుభద్ర వాళ్ళన్న య్యని ఈ విషయాలు అడిగింది. ఆ పిల్లకు జంకూ భయమూ లేదు. రెండు నిమిషాల్లో మళ్ళీ నాదగ్గ రికి వచ్చింది. సుభద్ర. ఏమన్నారు మీ అన్నయ్య అన్నాను. సుభద్ర బిక్కమొహం పెట్టి "ఆదేమిటి వదినా, అన్నయ్య అట్లా విసుక్కున్నాడు. 'ఇదో నాటకం ప్రారంభించిందా మీ వదిన, అన్నాడు.

అదేమిటి వదినా. అన్నయ్యకు నీమీద కోపమా అన్నది. నాకు ఏం చెప్పాలో తోచలేదు. "కోపంకాదు సుభద్రా ఊరికినే అన్నారు. నేనంటే ఇష్టంవే. నేనేం బావుండలేదా చెప్పు. నాలో నువ్వేదయినా లోపం కనిపెట్టావా" అన్నాను.

"నీకు వంకేమిటి వదినా. చక్కగా, ముచ్చటగా ఉన్నావు. ఏ వంకా, లోపమూ లేదు. చదువుకున్న దానివి. నీకు లోపమేమిటి" అన్నది. నేను నవ్వి వూరుకున్నాను.

"సరేగాని వదినా. అన్నయ్యా, నువ్వూ ఎప్పుడూ సినిమాకి వెళ్లరేం. రేపు మీరిద్దరూ జతగా సినిమాకి వెళ్లాలి. అంతే. తెల్సిందా." అన్నది. అది నిజంగా అన్నదో, ఎగతాళిగా అన్నదో, నాకు అర్థం కాలేదు. వాళ్లన్నయ్యతో కూడా చెప్పి పెట్టింది. ఆ రాత్రి మీబావ నన్నడిగారు.

"సినిమాకు వెళదామన్నావటగా" అన్నారు.

"నేను అనలేదు. సుభద్రే అన్నది. నువ్వు, అన్నయ్యా ఎప్పుడూ సినిమాకు వెళ్లరేం అని. నేను సినిమా విషయమే ఎత్తలేదు." అన్నాను.

"పోనీలే. అదీ నిజమే. మనం సినిమాకు వెళ్ల వలసిందే. రేపు రెడీగా ఉండు. సాయంత్రం ఆరు గంటలకి వెళదాం. చూడు జానకీ. నీకేం కావలసినా నన్నడుగు. సుభద్రతో చెప్పకు. అది పట్టి కోతి."

అంత ఆప్యాయంగా మాట్లాడుతారని నేను అనుకోలేదు. ఈరోజున, నామీద, నాస్వామికి ఇంత దయ కలిగిందా అనుకున్నాను. వారియందు ప్రసన్నులయినందుకు ఎంతో మురిసిపోయాను. అనవసరంగా నామీద ఏర్పర్చుకున్న అనుమానాలు పోయినయ్యనుకున్నాను. నాజన్మ తరించిందనుకున్నాను. మనస్సులోనే ఆ వెంకటేశ్వర స్వామికి ధన్యవాదాలర్పించి నిద్రపోయాను. చాలా పొద్దు పోయింది. అర్ధరాత్రి అయి ఉండొచ్చు. అటునుంచి ఇటు పత్తిగిల్లి కళ్లు తెరిచి చూసే సరికి, పక్కమీదనే కూర్చుని నా ముఖంలోకి చూస్తు న్నారు. ఖంగారు పడి లేచి కూర్చున్నాను.

"ఏమండీ, నిద్ర పోలేదా. నాకు నిద్రవచ్చేసింది. ఏమిటో పాడు నిద్ర. ఎంతసేవయింది మెలుకువ వచ్చి" అన్నాను.

"నువ్వు కాపురానికి వచ్చినప్పట్నుంచి మెలుకువ గానే ఉన్నాను. జానకీ నిజం చెప్పు. నువ్వు మీచిన్న మావయ్యతో ....... " అర్ధోక్తిలోనే ఆయన నా ముఖంలోకి చూశారు.

నా జీవితంలో మళ్లీ చీకట్లు కమ్మినయ్యి. ఏరోజూ జీవితం ఒడుదుడుకులుగానే ఉంది. దీనంగా వారి వైపు చూశాను. వారి పాదాలమీద తల వాల్చాను. కన్నీటితో అభిషేకం చేశాను.

"ఎందుకండీ నన్నిట్లా అనుమానంతో, మాటలతో పొడిచి, పొడిచి చంపుతున్నారు. దైవ సాక్షిగా, మీమీద ప్రమాణం చేసి చెపుతున్నాను. మా చిన్న మావయ్యతో నాకే సంబంధమూ లేదు. చిన్న మావయ్య సహృదయుడు. సరదాగా కబుర్లు చెప్పేవాడు. గుణగణాల్లో దైవ సమానుడు. చిన్న మావయ్యే కాదు. నేను చదువుకునే రోజుల్లో కూడా ఎవర్నీ కన్నెత్తి చూడలేదు. నేనెవరినీ ప్రేమించలేదు. నాకలాంటి స్నేహితులు లేరు. స్నేహాలు, ప్రేమలూ నాకు తెలియవు. నేను ప్రేమించినా, కామించినా మీరే నా సర్వస్వం. ఈ అనుమానం [illegible] మనస్సులో నుంచి, హృదయంలో నుంచి ఎప్పుడు తొలగి పోతుందో నాకు తెలీటంలేదు. నేను పతితను కాను. దైవసాక్షిగా నేను ఏపాపం ఎరుగను." అంటూ ప్రాధేయపూర్వకంగా వారిని బ్రతిమాలాను. వారు మాట్లాడలేదు. ఆరాత్రి అట్లాగే గడిచి పోయింది. మర్నాడు నాకు సినిమాకు వెళ్లబుద్ధి పుట్టలేదు. పగలల్లా నాలో నేను మథన పడుతూనే ఉన్నాను. సాయంత్రం అయిదింటికల్లా మీ బావ కాలేజి నుంచి వచ్చారు. రాగానే "జానకీ సినిమాకు పోదాం తయారవు." అన్నారు. ఎందుకో నాకు ఏమాట అంటే ఏం తప్పోనని "సరే" నన్నాను. సుభద్రని కూడా రమ్మన్నాను. వస్తానని తయారయింది. సుభద్ర. అంతలోనే పెళ్ళాఅత్తగారు కల్పించుకుని.

"వాళ్లిద్దరి మధ్యా నువ్వెందుకే సుభద్రా. నువ్వూ మొగుడితో సినిమాకు వెళ్లే రోజులు ముందున్నాయి." అన్నారు.

సుభద్రకు కోపమొచ్చింది. ఎంత బ్రతిమాలినా సినిమాకు రానన్నది. మేం సినిమాకు వెళ్లటం మా అత్తగారికి ఇష్టం లేదు. ఆవిడ ఉద్దేశం వేరు. కొడుకు "అమ్మా, నువ్వూ రావే, సరదాగా అంతా కలసి సినిమాకు వెళదాం" అంటే ఆవిడా వచ్చేది. సుభద్రా వచ్చేది. ఆవిడను రమ్మన లేదని కోపం. కొడుకు రమ్మనందే. "నేనూ వస్తానురా సినిమాకు" అని ఎట్లా అంటుందావిడ. అత్తయ్యకూ, ఆడ బిడ్డకూ కోపాలు తెప్పించిన ఆ సినిమాకు పోకపోతే ఏ దేవుడు ఏడిచాడని నేనూ రానన్నాను. మీబావ వినలేదు. అయిష్టతగానే బయల్దేరాను. ఇద్దరం రిక్షా ఎక్కాం. వారితో సినిమాకు వెళ్లటం, రిక్షా ఎక్కటమూ అదే ప్రథమం." అన్నది అక్కయ్య. [illegible] సంఘటనలు గుర్తుకు తెచ్చుకుంటున్నదేమోనని నేనూ పలకరించలేదు. అక్కయ్య మళ్లా ఒక్కసారి నిట్టూర్చి:

"ఏమిటో సోదంతా చెవుతున్నావే సీతా. వినుగ్గా ఉందేమో. ఇదంతా పుణ్య చరిత్ర కాదు వినటానికి. పొద్దు పోయింది. పడుకో" అన్నది.

టైము చూశాను. రాత్రి పన్నెండయింది.

"నిద్ర రావటం లేదే అక్కా, నాకేం వినుగ్గా లేదు. వినుకోవటానికి నువ్వేం పరాయిదానివి కాదు. కాక పోయినా నీ జీవిత చరిత్ర వింటూంటే నాకూ నా జీవితంలో ఉపయోగ పడొచ్చు. నేనూ సామాన్య మానవురాలినే. దేవకన్యను కాదుగా" అన్నాను. —

ఆమాటకి రాధ నవ్వింది.

"నువ్వు దేవకన్యవు కాదని అంటే సరిపోతుందా. నిజంగా దేవకన్యవే సీతా. నాకు నిజంగా నువ్వు దేవకన్యవే అనిపిస్తోంది." అన్నది రాధ.

"ఎందుకని" అన్నది సీత.

"ఎందుకనో తరువాత చెప్తాను."

"భోజనం చేద్దామా"

"నాకు అకర్లేదు. మా అక్కయ్య జీవితచరిత్ర వింటూంటే నాకు ఆకలనిపించడం లేదు. మిగతా విషయాలన్నీ చెప్పు. పూర్తిగా వింటేనేగాని నేను భోజనం చెయ్యను. నాకు అన్నతి ధ్యాస కూడా లేదు. నీకు అవసరమైతే సర్వు వచ్చి చెప్త తుందిగా. ఒకసారి వెళ్లి చూసొద్దువు గాని. ఒక్క గుక్క కాఫీ తాగుదాం" అన్నది రాధ.

ఫ్లాస్కులో కాఫీ రెండు కప్పుల్లో పోసింది సీత. ఇద్దరూ కాఫీ తాగారు. అప్పటికి మధ్యాహ్నం పన్నెండు గంటలయింది. (సశేషం)



'హలో కవిగారూ! మీరు నిన్న రాసి పంపించిన పాటకి ట్యూన్ కట్టేశాగా! అద్భుతంగా రాశారు!'

'...అది పాటకాదుసామీ! హీరోయిన్‌తో హీరో చెప్పిన ప్రేమ డైలాగులు. కాస్త కొత్తవి రాసి పంపమంటే... డైరెక్టరుగారి కివ్వమని... పంపించా!'

# కొన్ని ఉత్తరాది వంటలు!

## కోఫ్తాలు

క్రోఫ్తా అనగా కాశ్మీరీ భాషలో ఉండలు అని అర్థం. ఇవి అరటికాయ, బంగాళాదుంప, తామర తూళ్లతో చేస్తారు. అరటి కాయలతో చేసేవిధం వ్రాస్తాను. ఆ మాదిరిగానే మిగిలినవాటితో కూడా చేసుకొన వచ్చును.

కావలసిన వస్తువులు : రెండు అరటికాయలు పెద్దవి. రెండు పెద్ద సైజు నీరుల్లిపాయలు రెండు వెల్లుల్లి రేకులు. 1 టేబుల్ స్పూను గరమ్ మసాలా పొడి. చిటికెడు పసుపు. తగినంత ఉప్పు, కారం.

మరుగుతూన్న నీళ్లలో అరటికాయలు తరగ కుండానే వేయ వలెను. కొంత సేపటికి నొక్కి చూస్తే ఉడికినదీ లేనిదీ తెలుస్తుంది. ఉడకగానే దింపి తొక్కలు వల్చి రోట్లో వేసి మెత్తగా రుబ్బి నిమ్మకాయ సైజులో వుండలు చేసి పెట్టుకొన వలెను. తొక్కలు పారేయ కండేం ? దానితో కూడా ఒక కూర చేసుకోవచ్చు. కుంపటి మీద నూనె పెట్టి మరుగుతూండగా ఈ ఉండలు అందులో వేసి లేత ఎరుపు రంగు రాగానే తీసి పళ్లెంలో పెట్ట వలెను. ఉల్లిపాయలు, మసాలా పొడి, కారం పొడి కలిపి మెత్తగా ముద్ద నూర వలెను. కుంపటి మీద కళాయి గిన్నె పెట్టి నాలుగు టేబులు స్పూన్లు నూనె వేసి కాగిన తరువాత ఉల్లి ముద్ద, చిటికెడు పసుపూ వేసి కమ్మని వాసన వచ్చే వరకూ వేయించి పావున్నర నీళ్ళ పొయ్యాలి. ఉంటే రెండు టొమాటో పళ్ళు వెయ్య వచ్చు. లేకపోయినా ఫరవాలేదు. పావున్నర నీళ్లు పావు అయిన తర్వాత దింప వలెను. ఇప్పుడు రసం తయారైందన్నమాట. ఈ రసంలో వేయించి వుంచుకున్న కోఫ్తాలు (ఉండలు) వేసి మూతపెట్ట వలెను. భోజనాల వేళకు ఉండలు రసంలో ఊరి రుచిగా వుండును. ఇక తొక్కలు చిన్న సైజులో ఇటు అటు ముచికలు తీసి ముక్కలు చేసి పెట్టుకోవాలి. పావెడు శనగ పిండి, పైన చెప్పిన మసాలా ముద్ద ఒక గిన్నెలో వేసి కొంచెం నీళ్లు పోసి గరిటె జారుగా కలుపుకొని తరిగి వుంచిన ముక్కలు అందులో వేసి ముక్కలకు ముద్ద అంటుకునేటట్లు చేత్తో కలపాలి. కుంపటి మీద మూకుట్లో కొంచెం ఎక్కువగా నూనె పోసి ఈ ముక్కలను అందులో వేసి 15 నిమిషాలు వేయించి దింపవలెను. ఈ కూర మీ అతిథులకు వడ్డించి ఏం కూరో చెప్పుకో మనండి చూద్దాం !

ఈ విధంగానే బంగాళాదుంప, తామర తూళ్లతో కూడా చేసుకొనవచ్చు.

## రసేదార్ సబ్జీ

ఈ ప్రాంతాలలో ( లక్నో ) బంగాళా దుంపల పంట ఎక్కువ కనుక ఇక్కడి వారంతా బంగాళా దుంపలతో మరొక కూర కలిపి చేస్తారు. ఈ కూర రొట్టెలలోకి చాలా బావుంటుంది. గోబీ+బంగాళా దుంప, వంకాయ+బంగాళా దుంప, అనప+బంగాళా దుంప, ఈ మాదిరిగా అన్ని రెండేసి కలిపి చేస్తారు. ఈ కూర చూచుటకు ముక్కల పులుసు మాదిరి వుంటుంది. పులుసు కావలసిన వారు పైన చెప్పిన ప్రతి కూరలోనూ రెండు టొమేటో పళ్లు వేసుకో వచ్చు. ఏమైనా రెండు కూరలు తీసుకుని కొంచెం పెద్ద సైజులో ముక్కలు తరుక్కోవాలి. రెండు పెద్ద సైజు వుల్లిపాయలూ రెండు వెల్లుల్లి రేకులూ, ఒక టేబుల్ స్పూను గరమ్ మసాలా పొడి, చిటికెడు పసుపూ, తగినంత కారం, ఉప్పు కలిపి ముద్ద నూరాలి. మూకుడులో నాల్గు టేబుల్ స్పూన్లు నూనెలో వుల్లి మసాలా ముద్ద బాగా వేయించి తరిగి వుంచుకున్న ముక్కలు కూడా వేసి పది నిముషాలు వేయించి 1 గ్లాసున్నర నీరు పోయాలి. ముక్క మెత్తబడగానే కింద దింప వలెను.

## సూఖా సబ్జీ

సూఖా సబ్జీ అంటే పొడికూర. బెండ, దొండ, కాకర, పనస, వంకాయ, కాబేజీ, బీట్‌రూట్, కారెట్, మొదలైన కూరలన్నిటితో చేసుకొనేది. పైన చెప్పిన విధంగా వుల్లి మసాలా నూరి వుంచుకుని కుంపటి మీద మూకుడులోనూనె మరిగిన తరువాత వుల్లి మసాలా ఎర్రగా వేయించి తరిగి వుంచుకున్న ముక్కలు అందులో వేసి కొంచెం నీరు జల్లి మూత పెట్టి కూర మగ్గిన తరువాత దింప వలెను. పనసకాయ పెద్ద ముక్కలుగా తరిగి నీటితో ఉడికించి వార్చి అప్పుడు మసాలా ముద్దలో వేయవలెను.

## రాయతా

దీన్ని మనం పెరుగు పచ్చడి అనవచ్చు. మరీ పులుపూ, మరీ చప్పగా కాకుండా మధ్య రకంగా వున్న పెరుగు తీసుకుని కవ్వంతో కొద్దిగా నీళ్ళుపోసి మజ్జిగ గిలకొట్టవలెను. మజ్జిగ పెరుగులాగా బాగా చిక్కగా వుండవలెను. శనగపిండితో కారా బూంది వేయించి పెరుగులో వేసి తగినంత ఉప్పు, పసుపూ, పుదీనా ఇష్టమైనవారు అదీ, లేనివారు కొత్తిమేర నూరి కలుప వలెను. తరువాత కొద్దిగా ఆవాలు( టీస్పూను) వేయించి వేయవలెను. రెండు పచ్చి మిరపకాయలు కూడా సన్నగా తరిగి కలుపవలెను. దీన్ని ఇక్కడి వారు విందులలో తప్పకుండా సర్వ్ చేస్తారు.

కూరిన టొమేటోలు : శుభ్రమైన నాలుగు టొమేటో పండ్లు ( మిగల ముగ్గినవి కాక ఎర్రగా వున్నవి. ) తీసుకుని ముచిక వద్ద గుండ్రంగా కోసి ముచికలు తీసి ఒక పళ్లెంలో పెట్టుకొనవలెను. (పళ్లెంలో వుంచ వలసినవి ముచికలు ) చాకు తీసుకుని టొమేటో వున్న గుంజు, రసం ఒక ప్లేటులో పోసి పండు అంతా డొలక మాదిరి చేయాలి. అర్థశేరు బంగాళా దుంపలు బాగా వుడికించి తొక్క తీసి బాగా పిసికి ముద్ద చేయాలి. తగినంత కారపు పొడి, వుప్పు, 1 టేబుల్ స్పూను గరమ్ మసాలా పొడి, పండు నుండి తీసిన రసం, గుజ్జు, అన్నీ బంగాళా దుంప ముద్దలో కలిపి డొలక చేసిన పండులో నిండుగా కూరి, తీసి వేసిన ముచికలు మళ్లీ అతికించాలి. పండు మీద పెట్టి చేత్తో కొంచెం నొక్కితే అంటుకు వుండి పోతుంది. ఇప్పుడు మూకుడులో కొంచెం ఎక్కువగా నూనె గాని, డాల్డా గాని వేసి, కాగిన తరువాత భర్తీ చేసిన పళ్లు అందులో వేసి కొంత సేపు వేగిన తరువాత తీసి స్టీలు గిన్నెలో పెట్ట వలెను.

ఆకెళ్ల శారద

## వనితావాణి

స్త్రీ వంటింటి కుందేలు కాదు, అని అంటున్నారు. స్త్రీలకు ఉద్యోగాలు పెళ్లి అవనంతవరకు బాగానే సర్దాగా వుంటుంది. పెళ్లి జరిగి పిల్లలు కలిగినప్పుడు స్త్రీలకు ఉద్యోగము వలన కష్టమే గాని, సుఖము వుండదు. ప్రొద్దున్నే లేచి పిల్లలకు ( ఒకరయినా ఇద్దరయినా ) సంరక్షణ చేసి రెండు పూటలకు ఒకేసారి వండుకొని ( తీరుబడి వుంటే రెండుసార్లు వండవచ్చు ) పిల్లలు అల్లరి చేసినా ఆఫీసుకుపోవాలి!. సాయంకాలం ఇంటికి వచ్చేసరికి ఇల్లునరకంగా తయారవుతుంది. మళ్లా యిల్లంతా సర్దుకుని పిల్లల సంరక్షణ చేసి, వాళ్లను బుజ్జగించే సరికి ప్రాణం విసుగెత్తుతుంది. ఇంటి పట్టునఉండేస్త్రీఅయితే భర్త ఆఫీసుకు వెళ్లినతర్వాత పిల్లలను సుభ్రంగాతయారుచేసి ఇల్లు సుభ్రం చేసుకుని సాయంకాలం భర్త వచ్చేసరికి చిరునవ్వుతో ఆహ్వానించుతుంది. అప్పుడు అందరూ కలిసి షికారుకో, సినిమాకో వెళ్లవచ్చును.

ఏ. జయమ్మ. (నెల్లిమర్ల)

* * *

“లిప్‌స్టిక్ వగైరా కృత్రిమ పాశ్చాత్య సాధనాలు” అనే వ్యాసం చాలా బాగుంది. శ్రీమతి పవని నిర్మల ప్రభావతిగారికి నా ధన్యవాదాలు. ఈ నడుమ కొంతమంది అమ్మాయిల దుస్తుల అలంకరణ కూడ చాల బాధకరముగా ఉంటున్నది. వయస్సుకు తగ్గ మన భారత దుస్తుల అలంకరణలలో చెప్పలేనంత (లక్షణమైన) సౌందర్యము ఇమిడియున్నది. కాని యిప్పుడు వచ్చిన యీ ‘జీన్స్’ ‘స్లాక్స్’ మరి ఏవేవో దుస్తుల వలన నీచపు దుర్మార్గుల కళ్లకు విందుగాను ధరించెడి వారివల్ల భారత కుటుంబమునకు అవమానకరముగను కనపడుతుంది.

పద్మ ప్రసన్నకుమార్ (కె. జి. ఎఫ్) ★

# ఆరు వేల మైళ్ళు

**డెర్వ్లా మర్ఫీని వాళ్ళ లిస్మోర్ లో తన కోర్కెను వెల్లడించి నప్పుడు 'పిచ్చిపిల్ల' వన్నారు. మీరూ మొదట్లో అలాగే అనుకున్నా తర్వాత మెచ్చుకొని తీరుతారు!**






**"నేను ఐర్లేండ్ నుంచి ఇండియా అంటే భారత్ కు నా సైకిల్ మీద ప్రయాణం చేస్తున్నా, ఆ కథంతా నన్ను చెప్పనివ్వండి."**

* * *

**"ఉన్నట్టుండి, ఎక్కణ్నించి వచ్చాయో, ఒక్కసారి ఆ మసక వెన్నెల్లో మూడు తోడేళ్లు నామీద కురికాయి.**

ఉలిక్కిపడేటంతలో ఒకటి నా భుజం పట్టుకోబోయి స్వెటర్ చెయ్యి కర్చుకుంది. రెండో తోడేలు నా గౌను కుచ్చిళ్ళు లంకించుకుంది. పట్టు వదలకుండా వేలాడుతోంది కూడా. నేను నా రివాల్వర్ తీశాను. 'పేక్ఫ్లాచ్' లాగి ముమ్మారు వాటిమీద పేల్చాను. "ఢాం ఢాం ఢామ్మ" ని మూడు గుళ్ళు దూసుకుని అందులో రెండు తోడేళ్ళు నా కళ్ళముందే, నా కాళ్ళదగ్గరే వచ్చి పడ్డాయి. మూడోది కాళ్ళకి బుద్ధిచెప్పింది. ఆ దిక్కుగానే నేను మిగతా రివాల్వర్ గుళ్ళన్నీ కాళీ చేశాను.

ధైర్యం చిక్కబట్టుకున్నాను. బహుశా ఒక అబల ఎప్పుడూ చెయ్యని సాహసయాత్ర ఒంటరిగా నేనే కాబోలు చేస్తున్నాను అనే పూరతి మాత్రం నాకు ఉంది. అదే నా ధైర్యం కూడా.

దక్షిణ ఐర్లేండ్ దేశంలో నాదో చిన్న గ్రామం. నేను సైకిల్ మీద బయలుదేరి ఇలా వెళ్తాను అని అంటూవుంటే మా వూళ్ళో ఎవ్వరూ నమ్మలేదు. 'పిచ్చిపిల్ల' అనుకున్నారేమో.

'కాకి' మార్గాన ముక్కుకు సూటిగా మా వూరినుంచి ఎగిరితే 5000 మైళ్ళే కాని భారతదేశానికి సైకిల్ చక్రాలమీద వెళ్ళాలంటే మాత్రం 6000 మైళ్ళ మా ఊరి నుంచివుంది—దారికూడా తిన్నని, నున్ననిదేం కాదు! కంటక సంకటప్రాయమైన మార్గంగుండా వెళ్ళాలి. అందుకనే, మా 'వాటర్ ఫోర్డ్' జిల్లా లిస్మోర్ గ్రామవాసుల్లో తల నెరసినవాళ్ళంతా వాళ్ల బుర్రలు అడ్డంగా వూపారు.

పెద్దలంతా పిచ్చిదాన్ని అంటూవున్నా నాకు మాత్రం కుతూహలం చావలేదు. చిన్నప్పట్నించీ ఇండియా గురించి నాకు తియ్యని కలలు వస్తూ ఉన్నాయి! నేనెలాగైనా ఆ దేశం వెళ్ళాలి అనుకుంటూనే పెరిగాను. ఇక 'సైకిలింగ్' అంటే నాకు యింకా బోలెడు ఇష్టం. అసలు ఈ సాహసయాత్రకి నాంది నా పదో ఏటనే పడ్డది. నా పదో పుట్టినరోజున మా నాన్నగారు నాకో మంచి అట్లాసు కొనిఇచ్చారు. ఒక సైకిల్ బహుమానంగా కొన్నారు కూడా.

అప్పట్నించి అంటే గత 21 సంవత్సరాలుగా నేను భారత్ గురించి ఎక్కడ ఏ పుస్తకంలో ఏ కథ రాసినా చదువుతూనే ఉన్నాను.

పైగా వీలైనంత సైకిలింగ్ కూడా ప్రాక్టీసు చేశాను. ఫ్రాన్సుకో, ఇటలీకో మధ్య మధ్య అలా వెళ్ళి వస్తూ ఉండేదాన్ని. సైకిల్ పై స్పెయిన్ దేశంకూడా వెళ్ళాను.

ఆరువేలమైళ్ళు అంటే దూరం మాత్రమే కాదుగా—త్రోవలో తోడేళ్ళు మీద పడవా! దొంగలు, దోపిడీగాండ్రు మీద పడరా? వానలు, వరదలు, కొండలు, వాగులు అడ్డంరావా?

ఆకలి, దప్పికా, భయం, దాహం యివన్నీ కూడా రావా?

# సైకిల్ మీద అబల సాహసయాత్ర!

*డెర్వ్లా మర్ఫీ అనే యీ అమ్మాయి ఐర్లెండ్ నించి సైకిల్ మీద ఒంటరిగా జనవరి 14, 1963 న బయలుదేరి 6000 మైళ్లు అతి సాహసంతో ప్రయాణంచేసి ఇండియా చేరుకుంది. ఆమె కథ ఆమె మాటల్లోనే [వినండి] చదవండి.*

కాని, మా నాన్నగారు పోయిన 18 నెలల్లోనే మా అమ్మ కూడా నన్ను వొదిలి పరలోకయాత్ర చెయ్యడంతో ఇక ఈ దేశంలో నాకు గల అవినాభావ సంబంధం ఏముంది గనుక ?

స్నేహితులు హెచ్చరించారు. నేను మౌనభావం వహించాను. ఈ ప్రయాణానికి పథకం ప్రారంభించాను.

అది జరిగే సరికి క్యాలెండర్ సెప్టెంబర్ 1962 లో ఉంది.

నా అట్లాసుమీద నేను నా 'మార్గం' యిలా మార్కు చేసుకున్నాను. పటం చూడండి.

ఫ్రాన్సు, ఇటలీ, యుగోస్లావియా, బల్గేరియా, టర్కీ, పెర్షియా, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ అక్కణ్నించి ఒక్కసారిగా న్యూఢిల్లీ !!

సరే ! ఆ దేశాల్లో ఉండే రాయబార కార్యాలయాలకు నేరుగా రాశాను. నాకు ఇలా కోర్కె ఉంది. ఆయా దేశాల పరిస్థితులు, గతులు, వాటితో పాటు ఇతర అవసరమైన వివరాలు, 'వీసా' లు అన్నీ నాకు యిప్పించమని అర్జీలు పంపించాను.

నవంబర్ నెల వచ్చింది. ఇంగ్లాండ్ వెళ్లాను. కలరా, టైఫాయిడ్, మశూచి లాంటి వ్యాధులను నిరోధించగల 'ఇంజక్షన్' లు తీసుకున్నాను.

## మావూరి పెద్ద తలల నిరాశ

తిరిగి నేను మావూరొచ్చాను. ఇంకా మావాళ్లంతా నన్ను పిచ్చివాజమ్మగానే జమకడుతున్నారు.

"నువ్వు అబలవి. నీవీ సాహసం చేయడం కోరి కోరి యమదూతల బారిని పడటమే" నన్నారు.

వాళ్ల ఈ నిరాశావాదం నా పట్టుదలను పెంపొందించింది. ఐతే పూర్తిగా వాళ్ల మాటలను పెడ చెవిని పెట్టలేదు. డబ్లిన్‌కి వెళ్లి ఒక ('గన్') తుపాకీ కొన్నాను.

అది కొనడానికి వెళ్లినప్పుడు ఆ దుకాణదారుడు నన్ను వింతగా చూశాడు. సైకిల్ గుమ్మంలో వదిలి లోపలికి నేరుగా వెళ్లి నాకో తుపాకీ ఇమ్మన్నాను.

"ఎలాంటి తుపాకీ?!" మొహం ఇంత చేసుకున్నా డతగాడు.

"ఓ ! ఎంతదైనా సరే ! చిన్నదే చాలు" నేను చెప్పాను. "నామీద పడ్డ దేదైనా దాంతో కాడితే దెబ్బకి చస్తే చాలు"—

"బాగానే ఉంది కాని, అమ్మాయిగారూ! తమరు తుపాకీ ఎన్నుకొనే తీరు యిది కాదు" అన్నా డతను. "మొదట మీవూళ్లో పోలీసువాళ్లని అనుమతి పత్రం అడిగి తేవాలి" అన్నాడు.

సరే! మళ్లీ సైకిల్‌మీద రివ్వునవెళ్లి తిరిగి పర్మిట్‌తో సహా వచ్చి నేను. 25 వెళ్లి ఆటోమాటిక్ రివాల్వర్‌ను కొనుక్కున్నాను. 32 తుపాకీగుళ్లు కూడా దాచిపెట్టుకున్నాను—ఇంకేంకావాలి నాకు ?!

నా సైకిల్ ఉందిగా.

దానికి—వెనకటికి—డాన్‌క్విక్‌సోట్ తన గుర్రానికి పెట్టుకున్న ముద్దు పేరును—"రోజినాన్‌టే" అని పెట్టాను. ఖరమైన పొన్నూ ఖరీదే అయినా అది నాకు ప్రాణస్నేహితురాలు. అదే నా సర్వస్వమూను. దాన్ని చూస్తేనే నా కెంతో గర్వంగా ఉంటుంది. నా కీలుగుర్రానికి "జీను" కొనాలిగా. సంచులు కొన్నాను. అదే నా సరంజామా అంతా మొయ్యాలి మరి. తర్వాత కొత్త టైర్లు ఒక్కో జత చొప్పున ముందుగానే— ఇస్తాన్‌బుల్, అంకారా, టెహ్రాన్, కాబూల్, పెషావర్, న్యూఢిల్లీ—నగరాలకి పంపించేశాను.

## అసలు తైలం

అన్నింటికన్నా ముఖ్యమైంది అసలు తైలం ఒకటి ఉందికదా ! ఏమిటనుకున్నారు?—పైకం—

మా బ్యాంక్ మానేజర్‌కి ఫోన్‌చేసి ఓ రెండు వందలు పౌన్లు ఓవర్ డ్రాఫ్ట్‌కి జాగర్తపడ్డాను.

మొత్తం 14 మాసాల నా సైకిల్ ప్రయాణానికి నాకెంత ఖర్చైందనుకున్నారు ?

మూటనాలుగు పౌన్లు చిల్లర !

నిజంగా కలలో కూడా కనీ వినీ ఎరుగనంతటి ఈ అద్భుత, భయంకర, సాహసయాత్రకు యింత కాస్త డబ్బు సరిపోయిందంటే నిజంగా ఆశ్చర్యంగా లేదూ ?!

## సజీవ సమాధి

ఇది భయంకరయాత్ర ఎలాగంటారా ? అయ్యో కర్మ ! టర్కీలో నేను మంచులో సజీవసమాధి ఐపోయుంటే యివాళ మీరీ కథ వినకనే పోదురుకదా? పెర్షియాలో అక్కడి ప్రజ నన్ను రాళ్లతో కొట్టి వెంట తరిమారు ! కాని, మొండి ఘటాన్ని అప్పుడే కాదు; ఆఫ్ఘనిస్తాన్‌లో గుండాలు మీదపడ్డా నేను బతికి బయటపడ్డాను.

ఓసారి ఓ కొండపల్లెలో నేను తిండి దొరకక మలమల మాడిపోయాను. మరోసారి పాకిస్తాన్‌లో ఎడారి ప్రాంతాన సైకిల్ తొక్కుతూ దాహంతో గొంతుక ఆరి ప్రాణాలు కడబట్టాయి !

కాని అదంతా ఇప్పుడు తల్చుకుంటే వొళ్లు గగుర్పొడుస్తుంది. ఆనందంగాను ఉంటుంది. గుండె ఝల్లుమనీ అంటుంది !

నేను నా ప్రయాణం జనవరి 14 వ తేదీ 1963లో ప్రారంభించానుకదూ లిస్మోర్‌లోని నా నేస్తాల కారోజు గుడ్‌బై చెప్పాను—

నేను నిజంగా ఒక సందేశమో సందర్భమో ఉంచుకొని ఈ యాత్ర చెయ్యలేదు. వెర్రి ఆవేశంలో, సరదాలో బయలుదేరాను. ఇది సుహృద్భావ యాత్ర కాదు కాని ఢిల్లీ చేరుకున్న తర్వాత అక్కడ టిబెట్ శరణార్థుల సత్రం లో దిగి వారిని కలుసుకుని వారికి చేతనైన సహాయం చేసేక నా యీ యాత్రకు ఒక ప్రయోజనం—ఒక ఉత్తమ అవకాశం రెండూ లభ్యమయ్యాయనిపించింది.!

## ప్రయాణం 'సార్థకం' అయింది

వాళ్లకు శరణార్థుల శిశువులకు నేను సాయం చేయగలగడం నా మహద్భాగ్యం అనుకున్నాను. మరోసారి యీ అవకాశం లభిస్తే మళ్లీ అలా వారికి సాయపడతాను కూడా.

నాలుగు నెలలపాటు నేను ఒక ఒక స్విస్ డాక్టరుతోను, ఒక బ్రిటిష్ నర్సు జూలియన్ మాస్కెల్ అనే ఆమెతోను కలిసి శరణార్థబాలలకు సాయపడ్డాను.

సరే చెప్పానుగా జనవరి 14 తారీఖు '63 లో ఉదయం 8 గంటలకు నా కీలుగుర్రం రోజినాన్టె మీదకు లంఘించి నేను నా సుదీర్ఘయాత్రకు ఆయత్తమయ్యాను.

నాతో ఉన్న ఆస్తి లేదా సరంజామా అంతా ఇది. (1) మా నాన్నగారి వాచీ (2) ఒక "కంపాస్" (దిక్సూచి) (3) ఒక స్పేర్ టైరు (4) సైకిల్ చైను ముక్కలు. పంచర్ అయితే అవసరమైన సామాను (5) ఫస్ట్ అయిడ్ (ప్రథమ చికిత్స) కిట్, (6) రాతకోతల సామాను, (7) బ్లేక్ కవి రాసిన పద్యాల పుస్తకం (8) నెహ్రూగారు రాసిన రెండు పుస్తకం "భారతదేశ చరిత్ర". ఇవిగాక కొన్ని దుస్తులు. అంటే లోపల తొడుక్కునేవే





ఉన్నాయి. లాగులు, బాడీలు లాంటివి. బయట వేసుకునేవన్నీ నా వొంటిమీదే ఉన్నాయి. ఆరోజు మహా చలిగా ఉంది. నేను నాకున్న మూడు స్వెట్టర్‌లు తొడిగేసుకున్నాను. దానిమీద రెండు స్లాక్‌లు, ఆపైన ఒక పసుపు పచ్చ ఉన్ని ఓవర్ కోట్ వేసేసుకున్నాను.

చేతికి గోధుమవర్ణం "గ్లావ్స్" తొడుక్కున్నాను.

"పద! రోజెనాల్టే! ఢిల్లీకి పద" అనుకున్నాను.

మరి త్రోవలో ఉండటానికి ఒక "టెంట్" గాని, పడుక్కుందికి బిచాణా కాని తీసుకొని బయలు దేరలేదు నేను.

ఐరోపాలో హాస్టల్స్‌లో ఉందామని—ఆసియాలో ప్రజలే కాస్త ఔదార్యంగా ఆశ్రయ మివ్వక పోతారో అని నా ధైర్యం.

కాని, ఆసియా నేను చేరేలోగానే దారుణమైన చలికాలం నన్ను ఎదురువచ్చి కౌగలించుకుంది!

చాలా దారుణమైన పరిస్థితుల్లో ఉన్నప్పటికీ, ఈ నర్సూ, ఈ డాక్టరూ వెయ్యిమంది దౌర్భాగ్య బాలల ఆరోగ్యాలను చక్కబరచాలని ప్రయత్నం చేస్తున్నారు. ఆ సంఘటన అంతా నాకిప్పటికీ కనుల ముందు కదిలి, మనస్సు చలిస్తుంది. నాలుగు మాసాల తర్వాత వీళ్ళని ఇండియాలో వదిలి వెళ్లిపోతూ వుప్పుడు ఈ శరణార్థ శిశువులకు నే చేయ గలిగినంత సాయం చెయ్యాలని మనసారా అనుకొన్నాను. మళ్ళీ ఎప్పటికయినా అవకాశమయితే, ఈ శరణార్థ బాలుర దగ్గరకు వెళ్లి, వాళ్లకు సేవ చెయ్యాలనే ఉంటుంది. కేవలం ప్రయోగాత్మకం అనుకొన్న నా ఈ సాహస యాత్ర నిరర్థకం కాలేదనిపిస్తోంది, నాకిప్పుడు ఈ కథకు లభ్యమయ్యే పారితోషిక ద్రవ్యం అది ఎక్కువయినా, తక్కువయినా సరే, ఈ పిల్లల సంరక్షణ నిధికి ఇచ్చేయడమే నా అభిమతం. అంతే గాదు, ఇతరుల ఔదార్యాన్ని కూడా ఇందుకు వీలయితే ప్రోత్సహించటమే నా ధ్యేయం.

## మళ్లీ ప్రయాణం కథ

బిస్మార్క్‌కి 'గుడ్‌బై.' బిస్మార్క్‌లో ఉన్న నేస్తానికి 'గుడ్‌బై!'

కార్క్ నుంచి ఫిష్ గార్డ్‌కి నేను పడవలో వెళ్లాను. అక్కడి నుంచి 'డోవర్'కి రైలులో వెళ్లాను. మళ్లీ 'డన్ కర్క్'కు పడవలో పోవలసి వచ్చింది. అప్పుడు తిరిగి నా కీలు గుర్రం 'రోజ్ వాన్‌టే' మీదికి లంఘించి 'ఛలో' అను కొన్నాను. . . .

* * *

ఫ్రాన్సు పూర్తిగా మంచు మయంగా ఉంది. దరికి వచ్చిరంతయు మొట్ట మొదటి రాత్రి ఆగిపోయాను. అయినప్పటికీ, మొండిగా నేను బయలుదేరి, అతి కష్టం మీద 'యుగోస్లావ్' దాటే సరికి కూడా గడ్డు రోజులు గడిచేయే తప్ప పరిస్థితులేమీ బాగుపడలేదు. వాస్తవానికి నా సాహస యాత్ర ఇప్పుడే ప్రారంభమయింది. 'స్లొవేనియా' పర్వత కనుమగుండా నేను వెళుతున్నప్పుడు ఇంచుమించు తుఫానంతటి గాలి రెండుసార్లు నా సైకిలుమీద నుంచి నన్ను దూరంగా విసిరి కొట్టింది. మొదటి సారి అదృష్ట వశాత్తు రోడ్డు మీద పడ్డాను కాని, రెండోసారి చల్లని గడ్డ కట్టుకు పోయిన వాలుమంచు పడియలో బుడుంగున పడ్డాను కాస్తలో తప్పింది కాని, అక్కడి నుంచి మరో 5 వందల అడుగుల క్రిందకి 'అమ్మా' అనే పిలుపు లేకుండా వెళ్లిపోయి ఉండేదాన్ని!!

ఇక అక్కడ కీలుగుర్రపు సవారీ ఏం లాభం లేదని, నేనూ, నా 'రోజ్‌వాంటే' బరువుగా నడక ప్రారంభించాము. కాని పొడిమంచు, పొగమంచు కలిసి 'జివ్, జివ్'న అదపడా, ఈ దవడా వాయించేస్తూ ఉంటే ముందుకు సాగటమే అతి కష్టమయిపోయింది. కన్ను, మిన్నూ కానకుండా ఒక గంటసేపు, నడిచి ఒక గ్రామం చేరుకునేసరికి నేనూ, నా సైకిలూ మంచులో సగం కప్పబడి పోయాం. అక్కడి వాళ్ళు, ఇంచుమించు దగ్గరగా ఉన్న ఒక ఇంట్లోకి సాయం పట్టవలసి వచ్చింది. అది ఇల్లు కాదు. పానశాల. జనమంతా నన్ను ఏదో వింత మృగాన్ని చూస్తున్నట్లు చూస్తూ ఉన్నా గుక్కెడు బ్రాందీ గొంతులో పోసికొంటేనే తప్ప, నా నోరు పెగల్లేదు.

(ఇంకా ఉంది)



వ్యాసం

# అమెరికాలో విదుషీమణులు!

శ్యామసుందరి

**అమెరికాలో స్త్రీల జీవితవిధానం, ప్రపంచంలోని మిగతా దేశాల వారికంటే భిన్నంగా లేదు.**

ఏ దేశంలోనయినా సామాజిక జీవితంమీద స్త్రీల ప్రభావం ఎలా ఉంటుందంటే సముద్రపు నీటిలో తేలుతూండే హిమ శిలలాగా ఉంటుంది. పైకి అగుపించకుండా నీటి అంచుకు లోపలే మునిగి ఉన్నట్లు ఉంటుంది. కాని మిగతా దేశాలకీ, అమెరికన్ మహిళలకూ ఒక విషయంలో తేడావుంది. ప్రాచీన కాలంనుంచీ ఉన్న దేశాలలో ఎన్నో ఆచారాలు కట్టుబాట్లు, సాంప్రదాయాలు అనూచానంగా వస్తూ వున్నవి. కాని అమెరికాలో అలాకాదు. అమెరికా జాతి ఇటీవల కొన్ని శతాబ్దాల క్రితమే ఏర్పడింది. వివిధ దేశాలనుంచీ వలసవచ్చిన అనేక తెగలవారు, ఒక జాతిగా ఏర్పడి దేశపురోభివృద్ధికి కృషిచేసి ఈనాటి ఔన్నత్యం సాధించగలిగారు. ఏమీలేని ప్రదేశంలో బ్రహ్మాండమైన కట్టడాలు, పరిశ్రమలు నెలకొల్పారు. కావున స్త్రీలుకూడా తప్పనిసరిగా పురుషులతోబాటు సమానంగా బాధ్యత పంచుకో వలసివచ్చింది. స్థిరమైన సంప్రదాయాలేవీ లేక పోవటంవల్లనే ఇది సాధ్యమైంది. అంచేత మిగతా దేశాలవారికంటే, అమెరికన్ మహిళలు సమాజంలో మున్ముందుకు ఉన్నట్లు కనబడుతున్నారు. కాని వాస్తవం చెప్పాలంటే వారికి నలభై రెండు సంవత్సరాల క్రితమే వోటింగు హక్కు లభించింది. అంటే స్వాతంత్ర్యం లభించిన తర్వాత దాదాపు ఒక శతాబ్దంన్నర జరిగిన తర్వాతగాని ఈ హక్కు మహిళలకు లభించలేదన్నమాట.

## వారికున్న అవకాశాలు

జనాభాలో సగానికిపైగా 'అమెరికాలో' మహిళలు వున్నారు. దేశంలోని పరిశ్రమలలో పనిచేసే కార్మికులలో మూడు వంతులు మహిళలే! కళాశాలల్లో చదువుకునే వారిలో మూడు వంతులు మహిళలే! ఆశ్చర్యకరమైనదేమిటంటే స్త్రీలలో ఎక్కువమంది వివాహితులు. వారిలో సగం మంది వారి కాలాన్ని పూర్తిగా కుటుంబాలకే అంకితంచేసి ఇల్లూ, వాకిలీ సరిదిద్దుకోవటంలో గడుపుతున్నారు.

చాలామంది తమ జీవితంలో కొంత భాగమైనా ఉద్యోగంలో గడుపుతారు. బహుకొద్దిమంది మాత్రం తమ ఉద్యోగాలకే అంటిపెట్టుకుని జీవితాంతం ఉద్యోగులు గానూ, ఆర్జనాపరులుగానూ ఉండిపోతారు. దీనికి కారణం ముఖ్యంగా మహిళలకు ఆ దేశంలో ఎన్నో అవకాశాలు ఉండటమే! ఎన్ని రకాల వృత్తులున్నవో, అన్నిరకాల వాటిల్లోనూ మహిళలు వున్నారు. ఉదాహరణకు ఆ దేశంలోని కార్పొరేషన్‌లలోని వాటాలలో 5 వంతులు మహిళలకు చెందినవే!

కుటుంబంయొక్క ఆదాయం, వ్యయం లెక్క కట్టి కుటుంబాన్ని సరిగా నడిపించడమనేది స్త్రీలే చేస్తారు. అంటే భారతదేశంలోమాదిరి కాదన్నమాట! హిందూ కుటుంబాల్లో ఆర్జించేది పురుషుడు కాబట్టి, కుటుంబ పెద్ద పురుషుడే అవుతున్నాడు.

రాజకీయాల్లోకూడా అమెరికన్ మహిళలు గణనీయమైన పాత్ర వహిస్తున్నారు. కేవలం వారికున్నది సంఖ్యాబలమేకాదు. ఇంటింటికీ వెళ్లి ప్రతివారికీ నచ్చచెప్పి వోటు వేయించే పని యావత్తూ మహిళలే చేస్తారు. అంతేకాదు. మహిళల స్థితిగతులను పరిశీలించి, ఎప్పటికప్పుడు స్త్రీ సంక్షేమానికి ఏయే కార్యకలాపాలు అవసరమో నిర్వహించడానికి వూరూరా, వాడవాడలా అనేక మహిళా సంస్థలు వున్నవి. దాదాపు ప్రతివారు ఆ సంఘాల్లో చేరి తమ తమ విధులను నిర్వహిస్తారు.

## విద్యారంగంలో

విద్యారంగంలో : సర్వసాధారణంగా బాలురు, బాలికలు స్కూళ్లలో కలిసే చదువుకుంటారు. విద్య ఉచితంగానూ, నిర్బంధంగానూ ప్రతివారికీ నేర్పించుతారు. చాలా రాష్ట్రాల్లో 16 సంవత్సరాలు వచ్చేవరకు చదువుకోవటమనేది తప్పనిసరి! కనీసం 8 సంవత్సరాలైనా ప్రతివారికీ విద్యార్థి దశలోనే గడచిపోతుంది.

సెకండరీ విద్యవరకూ బాలురు, బాలికలు ఒకే సబ్జక్టులు చదువుకుంటారు. ఆ తర్వాత వృత్తి విద్యలలో చేరేటప్పటికి, వారివారి అభిరుచులూ మారతవి. జీవిత విధానమంటూ మారుతుంది.

కాలేజీలకు వెళ్లేవారు చాలా కొద్దిమంది. విద్యార్థినులు కాలేజీలో చేరే విద్యార్థుల సంఖ్యలో సగంమంది మాత్రమే! సాధారణంగా అమెరికాలో యువకులైన ప్రతివారూ ఏదోఒక వృత్తి విద్యగానీ, సాంకేతిక విద్యగాని అభ్యసిస్తారు. ఇలా యువతరానికి చెందిన జనాభాలో నలుగురిలో ఒకరు చొప్పున కాలేజీ విద్య నభ్యసిస్తుంటే, స్త్రీలలో ఎనిమిదిమందిలో ఒకరుమాత్రమే చదవగలుగుతున్నారు. అవకాశాలు లేక కాదు. అన్ని సంస్థలలోనూ అడమగా తేడాలేకుండా ప్రవేశం లభిస్తుంది. కాని స్త్రీలు అంతగా చేరటంలేదు. ఇందుకు కారణం ఒకటే.! చాలామంది వివాహితులై జీవితంలో స్థిరపడిపోతున్నారు. వెనుకటి తరాలవారికంటే గత 10 ఏళ్లలోనూ అతి చిన్న వయస్సులోనే అంటే సెకండరీ విద్యపూర్తి అయి కాకముందే, స్త్రీలు గృహిణులు కావటం జరుగుతున్నది.

కాని కుటుంబ బాధ్యతలు కొంత తగ్గినతర్వాత వయోజనులైన స్త్రీలు మళ్లీ కాలేజీలకు వచ్చి చదువుకుంటున్నారు. ఇదొక విశేషమనే చెప్పాలి. ఇలా శిక్షణపొందినవారు దేశానికి చాలా అవసరం. శిక్షణ పూర్తి అయిన వెంటనే వీరంతా మళ్లీ ఉద్యోగాల్లో చేరి దేశంలోని సంపదను అధికం చేయడానికి ఉపయోగపడుతున్నారు.

# ఉద్యోగాలలో వనితాలోకం వ్యాసం

ఒక పద్ధతి ప్రకారం ప్రత్యేకమైన అభిరుచి, రిసెర్చి చేయాలనే జిజ్ఞాసలేని వారంతా 17, 18 సంవత్సరాల వయస్సు రాగానే అంటే సెకండరీ విద్య పూర్తికాగానే ఉద్యోగాల్లో చేరుతారు. 3, 4 సంవత్సరాలు చేసి వివాహం కాగానే ఉద్యోగం మానేయటం కూడా జరుగుతున్నది. కాని సంసార భారం తగ్గి, బిడ్డలు బడికి వెళ్ళే వయస్సు రాగానే, ఆమె మరల ఉద్యోగంలో చేరి 10, 20 సంవత్సరాలవరకూ పనిచేయుటంకూడా పరిపాటి అయింది. ఈ సందర్భంలో మరొకటి చెప్పాలి. పసిబిడ్డలను ఇంట్లో వదిలి పనిలోకి వెళ్ళేవాళ్ళు ఉంటారు. ఇది మనకు వ్యవహారంలోను దానికి భిన్నంగా లేదూ!

అమెరికన్ మహిళలకు ప్రధానవృత్తి ఆఫీసులు నడపటం. సెక్రటరీలుగా, డిప్యూటీలుగా స్టెనోగ్రాఫర్లుగా, టైపిస్టులుగా మహిళలతో అధిక సంఖ్యాకులు పనిచేస్తున్నారు. ఆ తర్వాత ఎక్కువమంది షాపులలో 'సేల్సు వుమెన్'గా వున్నారు. ఆయాలుగా, వంట మనుష్యులుగా, హెయిర్ డ్రెస్సర్లుగా, చిన్న చిన్న ఫ్యాక్టరీల్లో వర్కర్లుగాకూడా ఎంతో మంది వున్నారు.

నూటికి అయిదుమంది మాత్రమే. వ్యాపార సంస్థలకు ప్రొప్రయిటర్లుగా, మానేజర్లుగా వున్నారు. పోతే నూటికి పదముగ్గురు మాత్రమే డాక్టర్లుగానూ, లాయర్లుగానూ, టీచర్లుగానూ, తదితర వృత్తులలోనూ వున్నారు.

మిగతా అన్ని దేశాల్లోలాగే అమెరికాలోకూడా కొన్ని రంగాలు ప్రత్యేకంగా స్త్రీలకే కేటాయించబడినవా అన్నట్లున్నాయి. నర్సులు, లైబ్రేరియన్లు, స్కూలు టీచర్లు, సోషల్ వర్కర్లు దాదాపు మహిళలే!

కళలు, సాహిత్యం మొదలైనరంగాల్లో, అమెరికన్ మహిళలు ప్రశంసనీయమైన పాత్ర వహిస్తున్నారు. సాంస్కృతిక రంగంలో ప్రఖ్యాతులైన వారిలో చాలామంది మహిళలు! రచయిత్రులు కాథరిన్ అన్, పెరల్‌బక్ పేర్లు సుప్రసిద్ధమైనవే! మెరియానీమూర్ అనే ఆమె కవయిత్రి! ఒపెరా, కాన్సర్టు, విషయంలో షారెల్, అయొంటీన్ ప్రైస్, పేర్లు మరువటానికి వీల్లేదు. నాటక రంగంలో 'మార్తాగ్రాహం', 'అగ్నిస్‌డిమిల్లి' పేరుపడ్డవారు. చిత్రకళలో ఆరితేరిన స్త్రీ జార్జియా ఓకీఫ్. వీరేకాక ఇంకెందరో లలిత కళలను అభ్యసించి, కళామతల్లికి సేవ చేస్తున్నారు.

ఇంతచేసినా ఇంకా దేశంలో స్త్రీపురుష భేదం స్త్రీలు ఎదుర్కోక తప్పటంలేదు. కాని వారు ధైర్యం చేసి అన్ని రంగాల్లోనూ, వృత్తులలోనూ చొచ్చుకు పోతున్నారు. తక్కువ రాబడి వచ్చే చిన్న చిన్న ఉద్యోగాల్లోనే ఎక్కువమంది వున్నారు. ప్రమోషన్లు కూడా, పురుషులకంటే ఆలశ్యంగా వస్తవి. ఉన్నతమైన పదవులలో చాలా కొద్దిమందే వున్నారని చెప్పుకున్నాం. ఇంకా ఎక్కువమంది వుంటేనేగాని అభివృద్ధి వీలుపడదు. చాలామంది ''కెరీర్''కంటే ''పెండ్లి''కే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వటంవల్లనే ఈ చిక్కంతా!

అందుకనే కీ॥ శే॥ కెనెడీ 26 మంది స్త్రీ పురుషులతో కూడిన ఒక కమిషన్‌ను నియమించాడు. ఈ కమిషన్‌వారువారు పబ్లిక్‌రంగంలో ఎందరు స్త్రీలు ఉద్యోగాలలో వున్నారు. ప్రైవేట్ రంగంలో ఎందరు వున్నారు. వారికున్న భద్రత ఎలాంటిది. వారికున్న ఇన్సూరెన్సు సౌకర్యాలు ఎలాంటివి అనే వాటిమీద నివేదిక సమర్పించాల్సి వుంటుంది. ఇంకా కొన్ని చట్టాలు, 'న్యాయసూత్రాలు' మార్చే విధంగా 'రికమెండు' చేయాలి. స్త్రీలు పురుషులతో పాటు సమానంగా ఆఫీసులు నడపగలరు అనే భావం కలగాలి.

(సశేషం)

# దగ్గు మరియు రొంపనుండి
# నిజమైన స్వస్థత పొందుటకు





# సిరోలిన్ వాడండి




దగ్గు లేక రొంపను అశ్రద్ధచేయకండి. సిరోలిన్ వాడి నిరపాయముగా, శీఘ్రముగా నిజమైన స్వస్థత పొందండి. సిరోలిన్ దగ్గును ఆపుటయేకాదు. అది మీ దగ్గుకు మూలకారణమైన హానికరమగు సూక్ష్మ క్రిములను నశింపచేయును; కఫమును నుసను పోగొట్టును. సిరోలిన్ ఎంత కష్టమైన దగ్గునైనను శీఘ్రముగా పోగొట్టి స్వస్థత చేకూర్చును. దాని పనితనమును బట్టియు రుచిని బట్టియు సిరోలిన్ కుటుంబములోని వారి అందరి అభిమాన పాత్రమై యున్నది. పిల్లలకు సిరోలిన్ అంటే ఎంతో ప్రీతి.

**మీ యింట్లో సిరోలిన్ తప్పక ఉంచండి**

'రోష్' తయారు _ సోల్ డిస్ట్రిబ్యూటర్సు: వాల్లాస్ లిమిటెడ్

# ప్రేమ లేఖ

15 వ పేజీ తరువాయి

ఒక పూర్తి వ్యక్తిగా తయారవుతాడు. కరుణతో అతనికి వివాహం అయితే తప్ప, అతను విలువలేని నిస్సారమైన జీవితం గడిపే ప్రమాదం ఉంది. ఇంకో అమ్మాయిని చేసుకున్నా ఆమె కరుణ లాంటిది అయి ఉంటుందనీ,అతన్ని అర్థం చేసుకో గలుగుతుందనీ, ప్రత్యేకించి అతని హృదయాన్ని ఆకట్టుకో గలుగుతోందనీ నిశ్చయంగా చెప్పుకో లేము గదా.

విశ్వానికి కరుణపై అనురాగం ఉందని ఋజువు అయ్యాక 'ఈ విషయాన్ని కరణం గారి తో సంప్రదిస్తా' నన్నాను విశ్వం ఉలిక్కి పడ్డాడు, ఏదో ప్రమాద వార్త విన్నట్లుగా మీ దల్లిదండ్రుల ద్వారా అడిగిస్తాను. ఎడ్రసు ఇవ్వమని అడిగితే మరింత భయపడ్డాడు. వద్దన్నాడు. తనని బయట పడెయ్యవద్దన్నాడు. కరణం అంటే తనకి ఇష్టమే కాని తను చొరవ తీసుకుంటే అమ్మా నాన్నా అపార్థం చేసుకోవచ్చునన్నాడు. కాలమే సమస్యల్ని పరిష్కరిస్తుందన్నాడు. అతని పిరికి తనానికి అతన్ని పూర్తిగా మందలించి, ఇంటికి వెళ్లిపోయాను.

తర్వాత కరుణ సంగతి ఆలోచించాను. ఆమెని తండ్రి ప్రభాకరానికైనా చేస్తాడు. ఆమె కాదంటే మరెవరికైనా చేస్తాడు. 'మరెవరికైనా' అన్న పదం కింద వచ్చే వేలాది మందిలో విశ్వం ఉన్నాడో లేడో నిశ్చయంగా తెలియదు. ఆయన అంతస్తుకి ప్రాధాన్యత ఇచ్చే పక్షంలో విశ్వానికి ఏ మాత్రం అవకాశం లేదు.

ప్రభాకరాన్ని చేసుకోవటం కరుణకి ఇష్టం లేదు. అతన్ని చేసుకుంటే నరక యాతనే అని ఆమెకి తెలుసు. అతనికే తండ్రి నిశ్చయం చేస్తే ఆమె ఏ అఘాయిత్యానికైనా పూనుకునే అవకాశం ఉంది. అది కాక మరే సంబంధమైనా చేస్తే ఆమె తండ్రి మాటను శిరసావహించవచ్చు.

కేవలం కరుణ వేపునించి ఆలోచిస్తే, ఆమె సుఖంగా ఆనందంగా జీవితం గడపాలంటే ఆమె విశ్వాన్ని చేసుకోవాలి. చేసుకోక పోతే ప్రభాకరాన్ని చేసుకోవాల్సి వస్తుంది. అది నరక సదృశం. ప్రభా కరాన్ని కాక మరెవర్ని చేసుకున్నా కూడా ఆమె సుఖ పడుతూందని నిశ్చయంగా చెప్పలేము. ఆభర్త విశ్వంలా ఆమెని ఆకర్షించగలడని, ఆమె హృద యంలో చోటు చేసుకోగలడని నమ్మకం ఏముంది?

కాబట్టి ఇప్పుడే ప్రయత్నం చెయ్యాలి. ఏదీ చెయ్యకపోతే ఆమెకి ప్రభాకరంతో పెళ్లవుతుంది. ఎలాగైనా ఆమెకి విశ్వంతో వివాహం జరిపించ టానికి నా శాయశక్తులా కృషి చెయ్యాలి. నా జీవి తంలో నేను ఒక మంచి పని అంటూ చెయ్యగలిగితే ఇదే అవుతుంది. నేను ఈ విషయంలో బాబాయితో గట్టిగా మాట్లాడ దలచుకున్నాను. కరుణ చెప్పి నట్లు బాబాయి దగ్గర నా మాట విలువ పోయినా నేను లెక్క చెయ్యను.

నాకైతే నమ్మకం లేదు ఈ వివాహం జరుగు తుందని. అయినా శాయశక్తులా ప్రయత్నించాలని నిర్ణయించుకున్నాను.

అనుకోకుండా నేను ఆ సాయంత్రం ప్రయా ణం కట్టవలసి వచ్చింది. నాకు బాగా తెలిసిన వాళ్లకి ప్రాణం. మీదికి వచ్చిందని టెలిగ్రాం వచ్చింది. పదిహేను రోజుల తర్వాతగాని తిరిగి రాలేక పోయాను. వచ్చాక నాకు పరిస్థితి అయోమయంగా కనిపించింది. విశ్వం కరుణకి ప్రేమలేఖ వ్రాయ టం, అది కరణం గారి దృష్టిలో పడటం, ఆయన అగ్గి మీద గుగ్గిలం కావటం, అతన్ని స్కూల్లోంచి ఊళ్లోంచీ దౌర్జన్యంగా బహిష్కరించటం జరిగి పోయాయి. నాకేమీ అర్థం కాలేదు. ఎందుకు జరిగిందో, అసలేం జరిగిందో స్పష్టంగా తెలియా లంటే బాబాయినే కలుసుకోవాలని వెంటనే పై మీది కండువా వేసుకుని బయలు దేరాను.

ఇంటికి వెళ్లేసరికి ఆయన మండి పడిపోతు న్నాడు. నన్ను చూడగానే 'చూశావా? సూర్యం! ఏం జరిగిందో' అన్నారు.

'ఏం జరిగింది.' అన్నాను.

'ఎంత జరగాలో అంత జరిగింది. కృతఘ్నుడు. విశ్వాసం లేదు. ఇంట్లో చోటు ఇస్తే ఇదేనావీడు చేసేది ?' అన్నాడు కోపంగా.

'విశ్వం సంగతా ?' అన్నాను.

'ఆ ! వాడి సంగతే : ఇది చదువు తెలుస్తుంది' అంటూ బాగా నలిగి పోయిన ఒక ఉత్తరం చేతి కిచ్చాడు. కోపంకొద్దీ ఆయన నలిపేసి ఉంటాడని తెలుస్తూనే ఉంది.

అందులో ఇలా ఉంది :

'ప్రియమైన కరుణా !

నేనెన్నోసార్లు నిన్ను ఒంటరిగా కలుసుకుని మనకు సంబంధించిన ముఖ్యమైన విషయం ప్రస్తావిద్దామని చూశాను. కాని వీలుకాలేదు. ఇక ఇంగలేక ఉత్తరం ద్వారా తెలియపరుస్తున్నాను. నన్ను అర్థం చేసుకుంటావని ఆశిస్తాను. నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాననే విషయం ఈపాటికి నువ్వు గ్రహించి ఉండవచ్చు. నీకు నాపట్ల సదభిప్రాయం ఉందనీ నాతో వివాహానికి నువ్వు సుముఖురాలివనీ నా విశ్వాసం. అయితే ఈ వివాహా నికి మీ బావ ఆటంకం ఉందని విన్నాను. మీ నాన్న గారు అటే మొగ్గుతున్నారని, అతనితో నీ వివాహ ప్రయత్నాలు జరుగుతున్నాయనీ తెలిసింది. నీ అభిప్రాయం నాకు తెలియదు. కాని డబ్బుని తప్ప మనుష్యులని ప్రేమించటం ఎరగని మీ బావతో నువ్వు సుఖపడతావని నేను అనుకోను. ఈ విష యంలో నీ జవాబు వ్రాస్తే ఏం చెయ్యాలో ఆలో చిద్దాము. మీ నాన్నతో సంప్రదించడం గాని— ఆయన ఒప్పుకోరని నీవు నిశ్చయంగా భావించే పక్షంలో మనిద్దరం కలిసి ఎక్కడికైనా వెళ్లి పోవ టం గాని— ఏదో ఒకటి చేద్దాము. ఇష్టం లేని పెళ్లిళ్లు చేసుకుని మన జీవితాలు వ్యర్థం ఎందుకు చేసుకోవాలి ? మనిద్దరికీ అంగీకారమైన తర్వాత ఇతరుల అంగీకారం ప్రసక్తి దేనికి ? మన రెక్కల మీద మనం జీవించలేమా ? ఆలోచించు.

నీ జవాబు కోసం ఎదురు చూస్తుంటాను.

ఇట్లు
నీ
విశ్వం.'

'చదివావా ?' అన్నాడు. అప్పటిదాకా నా ముఖం లోకి ఆత్రుతగా చూస్తున్న కరణంగారు.

'ఆ' అన్నాను నేను.

విశ్వం వ్రాసిన విషయాల కన్నా విశ్వం చేసిన ధైర్యమే నన్ను ఆశ్చర్య పరిచింది. 'నీ వివాహ విష

యాన్ని కదుపుతాను' అంటేనే 'వద్దు వద్దని' కంగారు పడిన విశ్వం ఈ ఉత్తరం ఏ ధైర్యంతో వ్రాసాడనేది నాకు అంతు పట్టలేదు. ప్రేమ బలీయం అంటారు. ఇందుకేనేమో. ప్రేమించినమనిషి ఎన్ని సాహసాలు చేస్తాడో చెప్పలేము. ఉత్తరం రాయడం ఒక లెక్కలోనిది కాదు.

'దాని విషయమే నాకు కంగారుగా ఉంది నాయనా! ఎంతయినా విషయం దాగదు. నాలుగు రోజుల్లో ఊ రంతా గుప్పుమంటుంది. మేనల్లుడేమో పెంకివాడు. మొండిఘటం. దీన్ని కాదన్నా అనగలడు. తర్వాత దానికి పెళ్ళికాదు : ఆ వేధన ఏదో చేసిపోయాడు. మేము అనుభవిస్తుండటానికి' అన్నాడు జరగబోయేదానికి భయం, విశ్వం మీద కోపం రెండూ ఆయన ముఖంలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఇప్పుడు విశ్వం తరఫున ఎలా మాట్లాడాలో నాకు తెలియలేదు. ఒకటి ఇది సమయం కాదు. ఆయన నిలువునా మండిపోతున్నప్పుడు, తన కూతురి భవిష్యత్తు గురించి శోకం, భయంతో నిండి పోయినప్పుడు ఒక వ్యవహారం మాట్లాడ కూడదు. ప్రత్యేకించి ఆయన కోపానికి పాత్రుడైన వ్యక్తి వివాహ విషయం, పైగా ఆయన కూతుర్ని ఇమ్మని అడగటం అసలు పనికి రాదు. ఇన్నింటికి తోడు ప్రేమలేఖ వ్రాసి విశ్వం పరిస్థితుల్ని పాడు చేశాడు. భమిడిపాటి వారన్నట్లు 'అసలే కోతి. అందులో కల్లు తాగింది. ఆ పైన తేలు కుట్టింది. దరిమిలాన ఎలక్షన్‌కి అభ్యర్థిగా నిలిచింది' అన్నట్లు తయారయింది పరిస్థితి.

అయినా ధైర్యం చేశాను.

'అమ్మాయి అభిప్రాయం కనుక్కున్నారా?' అన్నాను.

ఆయన అనుమానంగా చూశారు 'అంటే ?' అన్నారు.

నీళ్లు నమిలాను. 'విశ్వం అంటే ఆమె కెటువంటి అభిప్రాయం ఉందో తెలుసుకుంటే' అన్నాను తెగించి.

ఆయన తల తిప్పేసుకున్నారు.

"అక్కర్లేదు. అతనితో పెళ్లి ప్రసక్తి లేదు. అతని ఉనికి సైతం సహించలేము. కాళ్లు కడిగి పిల్లనిమ్మంటావా? అసంభవం' అన్నారాయన. నచ్చచెప్పటానికి శతవిధాలా ప్రయత్నించాను.

'రేపే వెడుతున్నాను మా బావగారింటికి' అన్నాడు.

'పోనీ ప్రభాకరం అంటే కరుణ కున్న అభిప్రాయం కనుక్కోండి ఆమె కిష్టం ఉన్నట్లు లేదు' అన్నాను.

'అవసరం లేదు. దాని ఇష్టా ఇష్టాలతో ప్రసక్తి లేదు. ఇదివరకే మాటిచ్చేశాను. నాకు మాట; వంశ ప్రతిష్ఠ ముఖ్యం' అన్నారాయన దృఢంగా.

ఓడిపోతున్నానన్న భావం కలిగింది నాకు. ఈ విషయం తెగేదాకా లాగ దలుచుకున్నాను.

'విశ్వం స్వతహాగా పిరికి వాడు. అతను ఈ ఉత్తరం రాశాడంటే నమ్మకం కలగటం లేదు' అన్నాను.

'బుజువు కావాలా ?' అంటూ ఆయన పని మనిషిని కేకేశారు. పని మనిషి వచ్చి నిలబడింది.

'చెప్పవే... ఏం చేశావో ?' అన్నారు ఆయన ఉరిమి చూసి.

'బాబుగోరి గది వూడవటానికి ఎల్లానండి. ఆయన ఉత్తరం ఇచ్చి కరుణమ్మగారికి ఇచ్చి రమ్మన్నారండి. నానటువంటి పనులు సెయ్యనని చెప్పానండి. ఓ పదినోటు నా సేతిలో పెట్టి నువ్వే సెయ్యాలని బతిమాలారండి. డబ్బు కాశపడి అది తీసుకుని తీసుకొత్తు ఉంటే పెదబాబుగోరు సూశారండి. బయమేసి దాచేస్తే ఉంటే బెదిరించి లాక్కున్నారండి' అంది భయంగా.

'దీన్నప్పుడే పనిలోంచి తీసేస్తానన్నాను. కరుణ వద్దంది. ఇరవయ్యేళ్లనించీ నమ్మకంగా ఉంటోంది. ఇవాళేదో తెలియక పొరపాటు చేసింది. అని నచ్చచెప్పింది. కరుణ మాట కాదనలేక ఉండనిచ్చాను. అన్నాడు. దానికేసి చూసి 'నువ్వు ఇంట్లోకి పోయి పని చూసుకో" అన్నాడు.

నేను కూడా ఇంటికి వచ్చేశాను.

* * *

చకచక నడుస్తున్నాను. విశ్వం ఇంకా వూరు వదలి ఉండడు పట్నానికి వెళ్లే రైళ్లు అంత తరచుగా లేవు. అతనింకా స్టేషన్‌లోనే ఉండి ఉంటాడు. వెళ్లి కలుసుకోవాలి.

స్టేషన్‌లో ఇంకా కాసేపట్లో కదలబోతున్న రైల్లో కనిపించాడు విశ్వం.

'సంగతి విన్నావా ?' అన్నాడు తల వంచుకుని.

'మొత్తానికి ధైర్యం చేశావు' అన్నాను ఏభావాన్నీ వ్యక్తపరచకుండా.

'నువ్వూ అది నేను రాశాననే అనుకుంటున్నావా?' అన్నాడు నేను మాట్లాడలేదు.

'నన్ను నమ్ము సూర్యం. అది నేను రాయలేదు.' అన్నాడు. అది అబద్ధం. స్పష్టంగా తెలిసి పోతోంది. నా దగ్గర ఒప్పుకోవటానికి సిగ్గు పడుతున్నాడు. ప్రేమలేఖ వ్రాయటం నేరం కాదు. ఇష్టం ఉన్న వాళ్లు తమ మనుసులని తెలుపుకునే ఉత్తరం అది. అది వ్రాయటం తప్పేమీ కాదు. రాశావని ఇతరులకి తెలియటం వలన మనకి కలిగే అగౌరవం ఏమీ లేదు. కాని విశ్వం జంకుతున్నాడు.

మామూలు పరిస్థితులలో అయితే విశ్వం నాతో నిజం చెప్పేవాడేమో. ఇప్పుడు ఇంత గొడవ జరిగాక ఒప్పుకోవడానికి సిగ్గు, భయం వేస్తున్నాయి' అతనికి ప్రేమలేఖ వ్రాసేటప్పుడు అతనికి ఒళ్లు తెలిసి ఉండదు. అదిచ్చేశాక కంగారు పడిఉంటాడు. అది ఇంత గొడవ చేశాక తప్పించుకోవడానికి మార్గాంతరం లేక బుకాయిస్తున్నాడు.

ప్రేమ లేఖతో దస్తూరీ అతనిది కాదన్న సంగతి అతన్నేవిధంగానూ బలపరచదు. దొంగతనంగా ప్రేమలేఖ రాసేవాడు— అందులోనూ విశ్వం వంటి పిరికి మనిషి— గుర్తు తెలిసేలా ఉత్తరం రాయడు. దస్తూరీ మారుస్తాడు.

'నువ్వు కూడా నమ్మకపోతే నా ఖర్మ !' అన్నాడు విశ్వం

'నేను నమ్ముతున్నాను' అన్నాను అతన్ని వూరడించడానికి. రైలు కదిలింది.

* * *

తర్వాత తీరిగ్గా ఆలోచించాను.

నేరం చేశాడని పూర్తిగా బుజువు కాని వ్యక్తికి 'బెనిఫిట్ ఆఫ్ డౌట్' ఇవ్వాలి. అతను నేరంచేసి ఉండకపోతే అన్న దృక్పథంతో ఆలోచించాలి. ఆ దృష్ట్యా ఆలోచిస్తే ఈ క్రింది విషయాలు చెప్పుకోవచ్చు.

ఒకటి విశ్వం నాతో అబద్ధం ఆడడు. ఎప్పుడూ మనసిచ్చి, అంతరంగిక విషయాలు సైతం మాట్లాడతాడు. రెండు, సహజంగా అతనికి 'ప్రేమలేఖ' రాసే ధైర్యం లేదు.

విశ్వం కాకపోతే మరెవడు ?

నాకు ఇద్దరి పేర్లు తోచాయి. ఒకడు ప్రభాకరం. రెండవ వాడు నాయుడు గారబ్బాయి.

విశ్వం అంటే కరుణ ఇష్టం చూపిస్తోందని ప్రభాకరం ఇక్కడికి వచ్చినప్పుడు తెలిసి ఉండాలి. ఆమె మీద కసికొద్దీ ఆమె జీవితం పాడుచెయ్యాలన్న సంకల్పంతో అతనే ఈ ఉత్తరం రాసి ఉండవచ్చు. పని మనిషికి ఉత్తరం ఇచ్చి కరణంగారికి దొరికి పొమ్మనీ బెదిరించినప్పుడు విశ్వం రాసిచ్చాడని చెప్పమనీ దానికి చెప్పి ఉండవచ్చు.

నాయుడుగారబ్బాయి. ఒకసారి కరుణ నీటికి వెళ్ళినప్పుడు వెధవ్వేషాలు వేస్తే కరణంగారు



# అజీర్ణము వల్ల ఎందుకు బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి




ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మందకొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**

C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ 86/A నయనియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3

JWT/CJH 2820 A

మొక్కలు పెరగనివ్వరంటారు. ఆ కోపం పెట్టుకుని అతను గాని, అతని తండ్రిగాని ఈ పని చేయించి ఉండవచ్చు.

వీరిద్దరూ కాక కరణంగారి శత్రువులెవరైనా ఈ పని చేసి ఉండవచ్చు. కరణం అన్న తర్వాత ఆయన ఎంత మంచి వాడైనా కొంత మంది శత్రువులు ఉంటారు.

విశ్వం రాయలేదనుకుంటే ఎవరు రాశారో అతనికి చూచాయగా తెలిసి ఉంటుంది. వూహించగలడు. మరెందుకు దాస్తున్నాడు ?

దీనికి సమాధానం తోచింది. రాసిన వాడు విశ్వానికి ప్రేమపాత్రుడయి ఉంటాడు.

వాయుడుగారబ్బాయితో విశ్వానికి చాలా స్నేహం ఉంది. ప్రాణస్నేహితులు కాదు గాని దాదాపు అంత స్నేహం ఉంది. ఊళ్లో ఉన్న అతని పరువు పోకుండా అతని నేరం తనపై వేసుకుని బయటి ఊరి వాడికి పొడటం సహజమే. పైగా విశ్వం తన పరువు ఎలాగా చెడింది కాబట్టి అతని పరువు రక్షిద్దామని అనుకుని ఉంటాడు. సహజంగా విశ్వంది ఉపకారం చేసే నైజం.

ప్రభాకరం మీద కూడా విశ్వానికి గౌరవం ఉంది. ఇంటి మేనల్లుడిగా, కరుణ బావగా అతనికి గౌరవం ఇస్తాడు. కరుణ విషయంలో తనకి పోటీదారులనీ కరుణని తనకి కాకుండా చేస్తున్నాడనీ అతనిపై కోపం లేదు విశ్వానికి. పైగా ఇంటిగుట్టు రచ్చ కెక్కించటం అతనికి ఇష్టం లేదు. ఆ పరిస్థితిలో ఇంకెవ్వరైనా త్యాగం చెయ్యరేమో కాని విశ్వం చేశాడంటే నమ్మలేని విషయం మటుకు కాదు.

ఎవరు రాశారో స్పష్టంగా తెలియక పోయినా పరిస్థితి అర్థమయింది.

నాలుగు రోజులకి కథ చాలా ముందుకి నడిచింది. విశ్వం కరుణల సంగతి ఊరంతా గుప్పుమంది. కరణంగారు బెదిరి పోయారు. వూరంతా గుసగుసలు. వినపడేటప్పటికి ఆయనకి కంగారు పుట్టింది. మేనల్లుడి వివాహం త్వరగా జరిపిస్తే గాని వీలులేదు. ఎవరూ వూరుకోరు. పైగా ఈ వివాహం తప్పిపోతే కరుణకి పెళ్లికాదు అన్న కంగారుతో ఆయనకి గంగవెర్రులెత్తిపోతోంది. పల్లెటూరు అలాంటిది మరి.

వూరికి ప్రయాణం కట్టారు కరణంగారు. అయితే ఎంత త్వరగా వెళ్లారో అంత త్వరగానూ తిరిగి వచ్చేశారు. ఆయన కోరిక ఫలించలేదు. ఆయన బావగారు చెప్పిన విషయాలివి.

'నిప్పులేందే పొగరాదు. మీ అమ్మాయి విషయం మంతా విన్నాం. పెళ్లిచేసుకోవడానికి మాకెంత మాత్రం ఇష్టం లేదు' అని.

అతడు ఉత్తరం రాస్తే అందులో కరుణ తప్పు ఏమి ఉందని అడిగారట కరణంగారు. ఆమె ప్రోత్సహించందే అతను ఒక అమ్మాయికి— అందులోనూ కరణంగారి కూతురికి— ఉత్తరం రాసి ఉండడని వాళ్లు అన్నారు.

ఆయన ఎంత ప్రబతిమాలినా ఫలితం కనిపించలేదు. ఈ విషయాలన్నీ నాతో చెప్పుకున్నప్పుడు వూరడించడం తప్ప మరేమీ చెయ్యలేక పోయాను.

తిరిగి పట్నం పని మీద వెళ్లి ఒక రోజు ఉండి వచ్చాను భోజనం చేసి విశ్రమించానో లేదో పిడుగులాంటి వార్త తీసుకువచ్చాడు పాలేరు. విశ్వం వూళ్లోకి తిరిగి వచ్చాడని. నిర్ఘాంత పోయాను. ఎలా వచ్చాడో, ఇది సంభవమా ! అన్ని విషయం, అంతకన్న జరిగిన పరాభవాన్ని విశ్వం ఇంత తేలికగా ఎలా మరచిపోయాడన్న విషయం నాకు అర్థం కాలేదు.

ఈ వూరు అతన్ని తిరిగి ఎలా సత్కరించిందో తలచు కోవడానికి కూడా భయం వేస్తోంది. విశ్వం ఎందుకు, ఎలా వచ్చినట్లు ? వీటికి సమాధానం రావాలంటే ముందు విశ్వాన్ని కలుసుకోవాలి. విశ్రాంతిని హాయిదా వేసి, తలుపువేసి బయటికి నడిచాను.

పరిగెత్తుకొచ్చి విశ్వం నన్ను కలిస్తే బాగుండుననిపించింది. కాని అటు వంటిదేమీ జరగలేదు. బస్సు దిగి వూళ్లోకి రావాలంటే కరణంగారింటి మీదుగా రావాలి. అతడు వూళ్లోకి వచ్చాడన్న సంగతి వూళ్లో ఏ ఒక్కరికి తెలిసినా అతడు బతికి బయట పడతాడన్నది సందేహమే. పైగా వచ్చేది కరణంగారి ఇంటి మీదుగా.

కరణం గారి ఇంటి ముందో, లోపలో ఏదో ఘర్షణ జరుగుతూ ఉండాలి. చకచకా నడుస్తున్నాను.

ఇంటి ముందు ఏమీ జరగటం లేదు. ఇంటి లోపల చూడాలి. సాధ్యమైనంత వేగంగా నడిచి కరణంగారింట్లోకి అడుగు పెట్టాను.

నా అంచనాలన్నీ తారుమారు చేస్తూ, నాకక్కడ కనిపించిన దృశ్యం నన్ను ఆశ్చర్య చకితుడిని చేసింది. నా కళ్లు నన్ను మోసం చెయ్యకుండా

**నిష్ఠుర నిజాలు!**

కోడలిపై అత్త కెంత
కోపముండునో తెలుసా?
కోడలిపై ఎంత ప్రేమ
కొడుకు జూపునో అంత!
అన్న కీర్ష్య తమ్మునిపై
ఎన్నడు కలుగునో తెలుసా?
తనకన్నా ఎందునైన
తమ్ముడుపై కొచ్చినపుడు !
గురువుగారికి చిరాకెపుడు
కలుగుచుండునో తెలుసా?
శిష్యుని ప్రశ్నకు జవాబు
చెప్పశక్తి లేనప్పుడు !
ఆడదాని కష్టాలకు
అంత మెప్పుడో తెలుసా?
ఆర్థికముగా పురుషునిపై
ఆధారపడనక్కర లేనప్పుడు!

—రాచాబత్తుల వీరరాఘవాచార్య

ఉంటే నేను చూసిన దృశ్యం ఇది విశ్వం, కరణం గారు, మరో ఇద్దరూ పెద్దమనుష్యులతో కుర్చీలలో కూర్చుని కాఫీలు త్రాగుతున్నారు.

'రా మూర్త్యం లోపలకి' అన్నాక తేరుకున్నాను. కరుణ కాఫీ తెచ్చింది. ఆమె ముఖంలో ఆనందం స్పష్టంగా చూడగలిగాను. ఇది శుభప్రదమైన కార్యం గురించిన సమ్మేళన మనీ, ఘర్షణ కాదనీ అప్పటికి గాని నా మనసుకి ఎక్కలేదు.

'ఈయన జగన్నాథంగారు. నా ప్రాణస్నేహితులు. విశ్వం తండ్రి' అంటూ పరిచయం చేశారు ఒకాయినని. నేను నమస్కారం చేశాను. ఆయన ప్రతి నమస్కారం చేసి నా సమాచారం అడిగారు. చెప్పాను.

'తాంబూలాలు ఇచ్చేసుకున్నాం' అన్నారు కరణం గారు.

విశ్వం వైపు చూశాను. విశ్వం మందహాసం చేస్తున్నాడు. కాఫీ ఫలహారాలు అయాక 'అలా వూళ్లోకి వెళ్లివద్దాం రావోయ్' అన్నాడు విశ్వం.

అతనితో వెళ్లాలని ఉంది కాని ఈ మిస్టరీ పూర్తిగా విడాలంటే కరణంగారితోటే మాట్లాడాలి. 'నువ్వు నడుస్తూ ఉండు తర్వాత వస్తా'నని అతన్ని పంపేశాను. వంతెన దగ్గర ఉంటానంటూ వెళ్లిపోయాడు విశ్వం.

అంతా విశ్రమించాక కరణంగారు నన్ను లోపలకి తీసుకెళ్లారు.

"ఆశ్చర్యంగా ఉందా ?! " అన్నారు.

"ఆశ్చర్యమా ? తల తిరిగిపోతేను ! " అన్నాను.

"నాకూ తల తిరిగి పోయింది. మా ప్రభాకరం కాదనగానే నిలువునా నీరయి పోయాను. వూరినిండా గుసగుసలు. నాకేమీ తోచలేదు. బయటికి పోలేక పోయాను. ఇంట్లో ఉండలేక పోతున్నాను. కూతురు ముఖం చూడలేక, నా ఖర్మకి విచారించలేక కూర్చుండి పోయాను. అసలా ఉత్తరం గురించి ఎందుకంత గొడవ చేశానా అనిపించింది. గుట్టు చప్పుడు కాకుండా అతన్ని పంపించేసి ఉంటే బాగుండేది అనిపించింది. ఇలా నన్ను నేను నిందించుకుంటూ ఇంట్లో కూర్చుంటే, నా కూతుర్ని గురించి ఆలోచించు కుంటుంటే నాకు దాదాపు పిచ్చిపట్టినట్లయింది.

నా నిస్సహాయత, విచారం విశ్వంపై కోపంగా మారాయి. నా కూతురు బ్రతుకుని నాశనం చేసిన వాడి బ్రతుకు నాశనం చేసి, వాళ్ల వూళ్లో వాడి పరపతి, గౌరవం బుగ్గిపాలు చేసి వాళ్ల తల్లిదండ్రుల్ని నడివీధిలో కడిగేసి నా కసి తీర్చుకోవాలనుకున్నాను. అతని ఎడ్రస్, ఆచూకీ కోసం అతని గదికి వెళ్లాను..............................

కరణంగారు ఒక్క క్షణం వూపిరి పీల్చుకు మళ్లీ మొదలు పెట్టారు.

'...... తన కోపం తన శత్రువు అంటారు. ఒక్కొక్కప్పుడు మిత్రుడు కూడా అవుతుంది. ఆ కోపంలో అతని గదికి వెళ్లకపోతే ఇవాళ ఇంత సంతోషంగా కాఫీలు త్రాగుతూ పెళ్లి కబుర్లు మాట్లాడ గలిగేవాడిని కాదు. పిల్ల పెళ్లి నిశ్చయమైందన్న ధీమాతో ఉత్సాహంతో పరవళ్లు తొక్కేవాడినీ కాదు.

విశ్వం గదిలో నాకు అతని డైరి కనిపించింది. కంగారుగా ఖాళీ చేసాడేమో అది మర్చిపోయాడు.

...గా అతని తండ్రి పేరూ, ఎడ్రసు కోసం చూశాను............

"నేను ఏం చూశాననుకున్నావు ? జగన్నాథం గారి పేరు. ! ఆయన ఎడ్రసు ! ..........

ఆ మాటలు చెబుతున్నప్పుడు ఆయన కళ్లు జ్యోతుల్లా మెరుస్తున్నాయి. నాలో ఆయన



# ప్రేమలేఖ

ఆశించినంత ఆనందం కనబడక పోయేసరికి ఆయన మళ్లీ ఇలా అన్నారు:

'జగన్నాథంగారి పేరు నీకు తెలీదు. తెలిస్తే ఆలా వుండవు. ఆ పేరు వింటే పువ్వులు పూస్తాయి. పైర్లు పెరుగుతాయి. పాపలు నవ్వుతారు. ఆయన నడిచిన చోటల్లా పచ్చగడ్డి మొలుస్తుంది. ఆయన ఉన్న చోట సుఖశాంతులు వర్ధిల్లుతాయి.

ఆయన నా ప్రాణం. నా భాగ్యదేవత. నాపాలిటి భగవంతుడు. నా జీవితాన్ని రక్షించినవాడు. నేను చేత కానీలేక మాపిన్ని ప్రసవానికి ముందు మందులు కొనలేక ఇంట్లో మొహం చూపలేక ప్రపంచం మీద విరక్తి పుట్టి చావలేక బ్రతకలేక పిచ్చివాడిలా తిరుగుతున్న రోజుల్లో 'నీ కెందుకు, నేనున్నాను' అన్నవాడు జగన్నాథం. నాకండగా నిల్చి ఆశ్రయం ఇచ్చినవాడు. రెండేళ్లపాటు నా జీవితంలో అడుగడుగునా సాయపడుతూ నన్ను ఒక మనిషిగా నిలబెట్టినవాడు జగన్నాథం అంటే. ఆయన చలవ వల్లే నాకూతురు నాకు దక్కింది. మాపిన్ని గండం గడిచి బయట పడింది. అప్పటికి. ఆయన కరుణే నాకు నాకూతురిచ్చింది. ఆ పేరే పెట్టాను దానికి' అన్నారు. కరణంగారు ఆవేశంగా.

"....ఆరు సంవత్సరాలుగా మాకు వారి జాడ తెలియలేదు. నిన్న తెలిసింది. అదీ ఈ ఉత్తరం మూలంగా. డైరీ మూలంగా. ఏదో ముఖ్య విషయం చెప్పాలని కరుణ నాతో అంటున్నా వినిపించుకోక ఆమెను తీసికెళ్లి జగన్నాథంగారి కాళ్లమీద పడేశాను. 'నువ్వు బ్రదికించిన దాన్ని నీయింటే చేర్చుకో' అన్నాను. ఆయన నవ్వాడు. ఎప్పుడూ అలాగే నవ్వుతాడు. ఆనవ్వు పాలరాతి కన్నా, తేట నీటికన్నా, పసన తొనకన్నా స్వచ్ఛంగా ఉంటుంది. ఆ నవ్వు విన్నవాళ్ల జీవితాలు ధన్యమవుతాయి......'

"......... నాకు ముందు తెలియలేదు కాని అబ్బాయి కూడా చాలా మంచివాడు. చాలా వినయం కలవాడు. సంస్కారం ఉన్నవాడు. నే నతన్ని ఇంత అవమానించినా అతనికి నాపై కోపం లేదు. చాలా గౌరవించి మాట్లాడాడు. అలాంటివాళ్లు వేలమందిలో ఒకడుంటాడు....

.....ఇదంతా చేసినది ఆ ప్రేమలేఖ" అన్నారు.

నాకు నిజమే ననిపించింది. అది చాలా చాలా అద్భుతాలు చేసింది. దూరంగా ఉన్న స్నేహితుల్ని కలిపింది. ఇష్టంలేని పెళ్లిళ్లు తప్పించింది. మనసు కలిసిన వాళ్లను దగ్గిర చేసింది. వీళ్లను చూసి కళ్లల్లో నిప్పులు పోసుకున్న వాళ్లని కుళ్లి కుళ్లి ఏడవమంది. ఇప్పటిదాకా జరిగిన, జరుగుతున్న సంఘటనలన్నీ ఆ 'ప్రేమలేఖ' చుట్టూ చిత్రంగా పరిభ్రమిస్తున్నాయి. అది మామూలు ప్రేమలేఖకాదు. దుష్టులకి ఆశాభంగం కలగాలనీ, మంచి వారికి శుభకార్యాలు జరగాలనీ దేవుడు పంపిన ఆజ్ఞాపత్రం.

ఇది విశ్వమే రాసి ఉంటే అది అతడి అదృష్టం. అన్నా. కరుణలాంటి చక్కని చిన్నదాన్ని అతను పోగొట్టుకున్నాడు ఈ ఉత్తరం రాయడం మూలంగా. కీడు చెయ్యమని పంపిస్తే మేలు చేసింది. నాయుడు గారబ్బాయి రాసి ఉన్నా అంతే. వాళ్లనుకొన్న దొకటి జరిగిన దొకటి.

వెంటనే విశ్వాన్ని కలుసుకున్నాను. ఈ మాట కూడా విశ్వం అంగీకరించలేదు. ప్రేమలేఖ తను రాసినట్లు, ఇది వరకు తానన్న మాట మీద నిలబడలని అయి ఉండవచ్చు. లేకపోతే 'అదృష్టం బాగుంటే కాబట్టి అంతా మంచి జరిగింది. మొత్తానికి నువ్వు చేసిన పని తప్పు' అంటానన్న భయం కావచ్చు.

"ఇంకా బుకాయించడం దేనికి ? అంతా సవ్యంగా జరిగాయి కదా !" అన్నాను.

"అన్ని విషయాలలోనూ నన్ను నమ్మేవాడివి. ఈ ఒక్క విషయంలోనూ ఎందుకు నమ్మటం లేదో నాకర్థం కావటం లేదు. నేను రాస్తే నాముఖ్య స్నేహితుడివైన నీతో చెప్పనా ? నీ దగ్గిర ఏదైనా దాచానా ?" అన్నాడు కళ్లల్లోకి చూస్తూ. అతను రాయలేదేమో ననిపించింది అప్పుడు. ఇంకా అనుమానం మిగిలి ఉన్నా అతను రాసి ఉండ దనే నిశ్చయించుకున్నాను.

'పోనీ రాసిన దెవరో నీకు తెలును' అన్నాను.

'నాకా ?' అన్నాడు ఆశ్చర్యంగా.

'అవును'

'ఎందుకనుకుంటున్నావు ?'

'తెలుసుకోవాలనే ఉత్సాహం నీకుంటుంది.'

'ఉంది. అయితే ?'

'నువ్వు దాస్తున్నావు. ఎవరు రాశారో నీకు తెలుసు. నేను ఇద్దరిని అనుమానిస్తున్నాను. వారిద్దరూ నీకు మిత్రులు. వారి పరువులు పోవటం ఇష్టం లేక నువ్వు దాస్తున్నావు. తెలుసుకోవాలనే ఉత్సాహం నాకు చాలా ఉంది. తప్పకుండా తెలుసుకుంటాను. నువ్వు ముందు చెప్పేస్తే మంచిది: నాకు శ్రమ తగ్గుతుంది !' అన్నాను.

"నువ్వు ఇవాళ కొత్తగా మాట్లాడుతున్నావు ! అన్నాడు విశ్వం. అతడు చెప్పడని నిశ్చయించేసుకుని సంభాషణ మార్చేశాను.

విశ్వం కరుణల వివాహం అతి వైభవంగా జరిగి పోయాక ఆరు నెలలు గడిచి పోయాయి. ప్రస్తుతం కరుణ, విశ్వం బెజవాడలో ఉంటూన్నారు.

ఉద్యోగ ప్రయత్నంలో నేను బెజవాడ ఇంటర్వ్యూకి వెళ్ళ వలసి వచ్చింది. విశ్వం వాళ్లింట్లో దిగాను. చాలా కాలం తర్వాత కనిపించిన నన్ను విశ్వం దంపతులు సాదరంగా ఆహ్వానించారు.

'బాగున్నావా అన్నయ్యా. ఇన్నాళ్లకి కనిపించావన్న మాట' అంది కరుణ.

ఇన్నాళ్లకి కూడా నాలంత నేను రాలేదనీ, నా ఉద్యోగ ప్రయత్నం నన్నిక్కడికి తీసుకు వచ్చిందనీ చెప్పుకోవటానికి సిగ్గు వేసింది.

నేను విశ్వంలో చాలా మార్పు కనిపెట్టాను. పూర్వం నిర్లిప్తంగా, నిస్పృహాయంగా కన్పించే ఆ కళ్లల్లో ఇప్పుడు ఉత్సాహం, ధైర్యం నిండుగా ఉన్నాయి. మనిషిలో చొరవ, ధీమా అధికంగా కనిపిస్తున్నాయి. మేము ఇదివరకే హేళన చేసే పిరికితనం పాలు ఇప్పుడతనిలో ఏకోశానా లేదు. ఈ మార్పుకి కారణమైన కరుణని మనసులోనే అభినందించుకున్నాను. మా స్నేహితులంతా కలిసి చెయ్యలేని కార్యం కరుణ ఒక్కరే సాధించింది.

కన్ను ఆనంద సాగరంలో ముంచి వేసాయి. వారిని విడిచి వెళ్లే రోజు వచ్చిందంటే నాకు చాలా బాధ అనిపించింది. వారి అన్యోన్యత, నాపట్ల ఆదరణ నన్నెంతగా బాధించి వేశాయి. కాని ఇంటర్వ్యూలో నెగ్గి, ఉద్యోగంలో జేరడానికి వెడుతున్న నాకు ఇక్కడ ఉండటానికి వీలులేదు.

ప్రొద్దున్న నిద్ర లేచేటప్పటికి ఆలుమగలు కాఫీలు సేవించి ఏదో పిచ్చాపాటి మాట్లాడు కుంటున్నారు.

'ఇవన్నీ నీకెలా తెలుసు' అంటున్నాడు విశ్వం.

'మీరు అన్నయ్యతో చెబుతోంటే విన్నాను' అంటోంది కరుణ. నా పేరు వినేసరికి నాకు బద్ధకం పూర్తిగా పోయింది. 'ఏమిటమ్మా నాకు చెప్పినది' అన్నాను.

'వారి చిన్ననాటి కబుర్లు : నాకెలా తెలిశాయి అని అడుగుతున్నారు ?' అంది.

'అతనంటే నీ ఆసక్తి అలాంటిది. నువు చాటుగా వినేదానివని నాకు ఎప్పుడో తెలుసు' అన్నాను.

'ఫో అన్నయ్యా' అంది కరుణ.

ఆ సాయంత్రమే ప్రయాణం కట్టాను.

'అప్పుడే బయలుదేరుతున్నావా ? ఇంక నాలుగు రోజులుండరాదా !' అంది కరుణ.

'ఇంకో నాలుగు రోజులుంటే ఈ ఉద్యోగానికి నీళ్లు వదులుకొని ఇక్కడే ఉండిపోవలసి వస్తుంది. అప్పుడు నాలుగు రోజులు కాదు. మళ్లీ ఉద్యోగం దొరికే దాకా'' అన్నాను నవ్వి.

ఇంతట్లోకే విశ్వం ఆఫీసునుంచి తిరిగి వచ్చాడు. రిక్షాలో ఒళ్లంతా దుమ్ము కొట్టుకుని ఉంది. కూడా వచ్చిన వాళ్లు వెళ్లిపోయారు. నేను ఆశ్చర్య పడి తేరుకునేలోగా కరుణలోపలికి వెళ్లి బట్టలు తేవడం, అతడు బట్టలు మార్చుకోవటం జరిగి పోయాయి.

''మాశావా మార్యం. నన్నేదో పిరికి వాడనేవారు కదూ. ఇవాళ చూడు ఎంత ఘనకార్యం చేశానో'' అన్నాడు.

ఏమిటని అడిగాను.

'ఏమీ లేదు. నేను ఆఫీసునుంచి వస్తున్నాను. అటువేపు నుంచి ఒక లారీ స్పీడుగా వస్తోంది. రోడ్డుకి అడ్డంగా ఎనిమిదేళ్ల కుర్రవాడు నడుస్తున్నాడు. హఠాత్తుగా లారీని చూసి, ఎటు పోవాలో తోచక కంగారు పడి అక్కడే కూలబడ్డాడు. లారీ దగ్గరకి వచ్చేస్తోంది. జనం ప్రాణాలుగ్గ బట్టుకుని చూస్తున్నారు. నేనేం చేశానో నాకు తెలియదు. మరుక్షణంలో నేనూ ఆ పిల్లడూ రోడ్డు పక్కన దుమ్ములో ఉన్నాం. లారీ పక్కనించి దూసుకు పోతుంది' అన్నాడు విశ్వం.

ఆశ్చర్యంతో నేనేమీ మాట్లాడలేక పోయాను. కరుణ భర్తవంక ఆప్యాయంగా చూస్తోంది.

'ఏమిటోయ్. ఏదో నన్ను అభినందిస్తావనుకుంటే మాట్లాడకుండా కూర్చున్నావు. నే చేసిన పని సాహసంలా కనపడలేదా ?' అన్నాడు నవ్వుతూ.

'సాహసమే. కాదనను. ఇది ఇప్పటి విషయం. ఈ రోజుల్లో విశ్వంగా నువ్వు కుర్రాణ్ణి లారీ ప్రమాదం నించి తప్పించటమే కాదు, ఒంటరిగా అడవిలో పులితో దెబ్బలాడావన్నా ఆశ్చర్యపడను. చాలా రెట్లు ఎక్కువ' అన్నాను.

'నేనా ? సాహసమా ?' అన్నాడు తెల్లబోయి.

'అదే ఆ నాడు నువ్వు చేసిన పని. ప్రేమలేఖ వ్రాయటం' అన్నాను.

విశ్వం మొదట తెల్లబోయిన మాట వాస్తవం కాని అంతలోనే అతని ముఖకవళికలు మారి పోయాయి.

'నేనా ? నేను రాయలేదు' అన్నాడు. తర్వాత నాకే బాధ అనిపించింది. అతడు ఏదో నేరం చేసినట్లు ప్రతిసారీ అడగటం అతడు కాదని మొత్తుకోవటం — స్నేహితుల మధ్య ఉండవలసిన అనుబంధం కాదిది.

కాని అతను ఇప్పుడు కూడా ఏదో దాస్తున్నట్లు అనుమానం కలిగింది నాకు. ఆ నాటి ప్రేమలేఖ గురించి మాట్లాడుతోంటే విశ్వానికి కాపాడవలసిన అవసరం అతనికిప్పుడు లేదు. అతడు రహస్యం బట్ట బయలు చేసినా వారికిప్పుడేమీ ఆపద రాదు. ఆ వేడి చల్లారి పోయింది. పైగా వాళ్లిద్దరూ ఇప్పుడిక్కడ లేరు. ఒకడు హైదరాబాదులో, ఒకడు మదరాసులో.

ఎవరేమీ మాట్లాడే పరిస్థితిలో లేము. కరుణ సంభాషణ చాకచక్యంగా మార్చేసింది, పరిస్థితి కనిపెట్టి.

'అన్నయ్య ఇప్పుడే వెళ్లిపోతానంటున్నాడు' అంది.

'అదేమిటి మరి నాలుగు రోజులుండి పోవచ్చుగా' అన్నాను. కొంచెం వూపిరి పీల్చుకుని.

'లేదు విశ్వం. ముందు ఇంటికెళ్ళి నా ఉద్యోగం వార్త ఇంట్లో చెప్పి విశాఖపట్నంలో జాయిన్ కావాలి. టైము లేదు' అన్నాను.

పరిస్థితి తెలుసు కనుక విశ్వం అభ్యంతర పెట్ట లేదు.

* * *

విశ్వం స్టేషనుదాకా వచ్చాడు.

విశ్వాన్ని అనుమానిస్తున్నట్లుగా ప్రవర్తిస్తు అతన్ని క్షమాపణ కోరవలసిన అవసరం నా కన్పించింది.

'చూడు విశ్వం. పొరపాటుగా ఉత్తరం విషయం తెచ్చాను. ఆ అది నీకిష్టం లేదని తెలుస్తోంది. అయినా నా ఉత్సాహం కొద్దీ నిన్ను బాధ పెట్టవలసి వచ్చింది. ఇంక అడగనులే' అన్నాను. జరిగిన దానికి క్షమించమనీ అడిగాను.

విశ్వం చాలా బాధపడ్డాడు.

'నువ్వే నన్ను క్షమించాలి. ముందు రెండు సార్లు అడిగినప్పుడు నాకు నిజంగా తెలీదు కాని ఇందాక అడిగినప్పుడు నాకు తెలుసు. తెలిసే కూడా నీకు చెప్పలేదు. కేవలం నీ ఉత్సాహాన్నీ, ఉత్కంఠ నీ క్లైమాక్సుకు తీసుకు రావాలనే ఉద్దేశంతోనే చెప్పలేదు. నాకీమధ్యనే తెలిసింది.' అన్నాడు.

'ఎవరు ?' అన్నాను.

'ముందు నువ్వు అనుమానితులన్నావు ? ఎవరో చెప్పు.

'అయితే ఆగు నువ్వు చెప్పకు ఉత్తరం రాసిం దెవరో నాకు తెలుసు. ప్రభాకరం' అన్నాను చిన్న పిల్లాడిలా కంగారుగా.

నిశ్చయంగా ఇతనే అయుండాలి. నేను నాయుడు గారి అబ్బాయిని అనుమానిస్తున్నట్లు విశ్వానికి తెలీదు.

'కాదు' అన్నాడు విశ్వం.

'కాదు కాదు. వెరీ సారీ, పొరపాటు ప్రభాకరం అంటే కరుణ బావగారు. కాదు... అతనూ కాదు. నాయుడుగారబ్బాయేమో.' అన్నాను.

విశ్వం తల అడ్డంగా తిప్పాడు.

నాకు కోపం వచ్చింది ఓడిపోతున్నందుకు 'నువ్వే' అన్నాను.

విశ్వం అందంగా నవ్వాడు. తల అడ్డంగా వూపి చెవులో ఒక మాట చెప్పాడు.

నా చెవులని నేను నమ్మగలిగితే నేను విన్నమాట 'కరుణ' 




''ఇదిగో ! దొంగాడా ! నీ ఖర్మకాలి యీ కొంపకి వచ్చావు ! అదిగో'' ఆ బల్లకింద వున్న హార్మోనీ పెట్టె తీసుకు ఫో ! దొంగా అని అరవకుండా వదిలేస్తా !!''




**జ రి గి న క థ**

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య కథను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికి కూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను ఉంటూవుండగా, జమీందారుగారి ఇరువురు హితుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మామయ్యకు ఇష్టంలేకపోయినా, మధు స్కూల్లో చేరతాడు. హెడ్ మాస్టరు మధు ప్రతిభను చూసి సంతోషిస్తాడు. విశ్వనాథం మధును సతాయించటాన్ని సుందరమ్మగారు ప్రతిఘటిస్తుంది. అంతేకాదు, మధుపట్ల నానాటికి విశ్వనాథానికి ద్వేషం పెరిగిపోవటం, సుందరమ్మగారికి బాధాకరంగా పరిణమిస్తుంది. తోటలో జరిగిన దొంగతనాలకు మధు బాధ్యుడవుతాడు. ఈవిషయాన్ని తెలిసికొన్న విశ్వనాథం మధును రక్తం కారేటట్లు కొడతాడు. దగ్గరి బంధువైన డాక్టర్ కేశవరావ్ పరిచయం మధులో కొత్త ఉత్సాహాన్ని కల్పిస్తుంది. ఉద్యోగంలో చేరిన సూర్యానికి ఆ ఇంటినుంచి విడిపోవటం తప్పనిసరి అవుతుంది. అనతికాలానికే సూర్యం గృహస్థుడవుతాడు. ఇందిర అతనికి తగిన భార్య. మధుకు ఇందిర వాత్సల్యం లభిస్తుంది. పై చదువులకు పట్నం వెళ్లిన మధు సెలవుల్లో ఇంటికి వస్తాడు. అయిష్టంగానే విశ్వనాథాన్ని చూడటానికి వెళ్తాడు. అక్కడ చిన్న ఘర్షణ జరుగుతుంది. పరీక్షలు వ్రాసి ఇంటికి వచ్చిన మధులో ఏదో వెలితివుందని ఇందిర గ్రహిస్తుంది. కాలేజీలో తను చేయని నేరానికి శిక్షగా, ఒక సంవత్సరం తన పరీక్ష ఆపారన్న పుత్తరాన్ని విశ్వనాథం చించినందుకు మధు కోపోద్దీపితుడై, అయన్ని తీవ్రంగా మందలిస్తాడు. జమీందారిణిగారింట్లో వున్న సుశీల పరిస్థితి మెరుగవుతుంది. ఇందిర అన్న భాస్కరం సుశీలను ఆకర్షిస్తాడు.

# 17

పలకరించటానికి పనికిరాని ఆ మూగపిల్లని చూస్తే ఏదో ఉత్సాహం కలుగుతుంది భాస్కరానికి. సుశీల నెదురుగా పెట్టుకుని మాట్లాడాలనే కోరిక సన్న సన్నగా బయల్దేరి వటవృక్షంలా తయారై కూర్చుంది. భాస్కరం మనోభావాలు ఎంచనా కట్టగలిగిన ఇందిర లోలోపల నవ్వుకొంది.

సుశీల అద్దంముందు నిలబడి తల దువ్వుకొంటూంటే భాస్కరం రెండు నిముషాలు గది ముందు తచ్చాడి లోపలికి వచ్చేశాడు. టేబుల్ దగ్గర నిలబడి పుస్తకాలు కెలుకుతూ సుశీలని చూడటంలో నిమగ్నమయ్యాడు—చటుక్కున వెనక్కి తిరిగిన సుశీల భాస్కరాన్ని చూసి కంగారుపడింది. అల్లుకుంటూన్న జడ వదిలేసి దువ్వెన పళ్లు లెక్కపెట్టటానికుపక్రమించింది.

సుశీలని పలకరించాలి. ఏదో మాట్లాడాలి. చేతికందిన పుస్తకం తీసి చూపిస్తూ అన్నాడు—అతి సామాన్యంగా "నువ్వీ పుస్తకం చదివేశావా సుశీలా ?"

సుశీల సిగ్గుతో చితికిపోతూన్నా బింకంగా తల తిప్పి పుస్తకంకేసి చూసింది—"లేదు" అన్నట్టు తల అడ్డంగా తిప్పింది.

"నీకు పుస్తకాలంటే చాలా యిష్టమనుకుంటాను. ఎప్పుడూ ఏదో చదువుతూనే ఉంటావు."

"........."

"నాకూ యిష్టమే. మంచి పుస్తకం ఉంటే అన్నం కూడా అక్కర్లేదు నిజంగా."

అలాంటి వ్యక్తులు తనకు చాలా యిష్టమన్నట్టు అభిమానంగా చూసింది సుశీల.

"నేను భావకవినా అని అడిగావట. నీ కెందుకలా అనిపించింది ?"

"........"

"అదేమోగానీ నన్ను చాలామంది అలాగే అంటారు. నేను రైటర్ని కాకపోయినా నా సరదా తీరిపోతోంది."

చిన్నగా నవ్వింది సుశీల.

"కళలనేవి సహజంగా రావటం అదృష్టమే అనుకో. లేనివాళ్లకి కొన్ని వేళావిశేషాల్లో కూడా అవి పెట్టుబడతాయట. వాల్మీకి నోటినుంచి రామాయణంలో మొదటి శ్లోకం అలా అశువుగానే వచ్చేసిందట కదూ ?—అయితే సామాన్యమైన మనిషిలో కళావాంఛ ఉద్భవించటానికి తగిన దోహదం కావాలి. అకస్మాత్తుగా అనుకోని విధంగా ఏదో జరగాలి—ఒక అందమైన అమ్మాయిని చూస్తే కవిత్వం పుట్టొచ్చు. సుందరమైన ప్రకృతి తిలకిస్తే చిత్రలేఖనం అబ్బవచ్చు. మధురమైన సంగీతం వింటే .... వింటే .... ఏదో కావచ్చు. ఇంతకీ ఏమిటంటే నేను భావకవిని కావటం విశేషమేమీ కాదు. నాలో ఉద్రేకం వస్తే, అంతులేనన్ని కథలు రాసిపారేస్తాను." భాస్కరం వాగ్ధాటి విరమించుకుని చూసేసరికి సుశీల కొంగు అడ్డం పెట్టుకు నిలబడిఉంది. రెండే రెండు పాయలు అల్లిన జడ పూర్తిగా విడిపోయి వీపంతా వెంట్రుక లావరించుకున్నాయి.

"నవ్వుతున్నావా ? ఎందుకూ ? నిజంగా నిన్ను చూస్తే కవిత్వం పుడుతోంది. అజంతా సుందరి స్నానంచేసి వస్తూన్నట్టుగా—.... "

"జానాను. ఎల్లోరా సుందరి స్నానానికి వెళ్తూన్నట్టుగా ...." కిటికీలోంచి చూస్తూన్న ఇందిర పకపకా నవ్వేసింది. భాస్కరం సుశీలా కూడా సిగ్గుపడిపోయారు—"నిజమేరా అన్నయ్యా ! ఈ సుందరిని చూస్తోంటే నాకూ కవిత్వం పుట్టేస్తోంది." ఇందిర గదిలోకి వచ్చింది. తల దించుకుని బయటికి పోబోతున్న సుశీలని కొంగు బట్టుకుని ఆపుతూ—"ఆగవమ్మా ! ఏం సిగ్గా ? నా దగ్గ రెప్పుడైనా యింత బుద్ధిగా నిలబడ్డావా ? మా అన్నయ్యతో నీకేమిటా మంతనాలు ? వాడంటే మొగ మహారాజు—ఏద్దైనా చేసి చెల్లించుకుంటాడు. అవునా ?" అంది. భాస్కరం మాట్లాడక తప్పలేదు——"ఉత్తదే ఇందిరా ! నేనే ఏదో వాగేస్తున్నాను గానీ పాపం సుశీలేం మాట్లాడలేదు నాతో."

ఇందిర బుగ్గలు నొక్కుకుంది— "అయ్యో రామా! ఈవిణ్ణి చూస్తే నీకు కవిత్వం పుట్టేవట్టే

తెలిసినట్లు జీవితానికి పాఠాలు నేర్పుతూ ఉన్నావే!''

భాస్కరం సిగ్గుపడి పోయాడు. ఇందిర ఇద్దర్నీ కాస్సేపు అలా పట్టించి వదిలేసింది.

తర్వాత ఇందిర అన్నగార్ని ఒంటరిగా అడిగింది. "సుశీలంటే నీ అభిప్రాయమేమిటి?'' అవలే తలబొప్పి కట్టివున్న భాస్కరం తూచితూచి మాట్లాడాడు— "సుశీలంటేనా? నాకు అభిప్రాయం ఏమిటి?''

"నీకున్నపాటి తెలివి నాకూ ఉందిగానీ సరిగ్గా మాట్లాడుదూ! నేనేం హాస్యానికి అడగటంలేదు. సుశీలని పెళ్లిచేసుకోవటం నీ కిష్టమేనా?''

భాస్కరం తృళ్లిపడ్డాడు— "సుశీలనా?''

"ఏం? అంత ఆశ్చర్యపోతున్నావ్. సుశీలంటే నీకు మంచి అభిప్రాయంలేదా?''

"ఇందూ! నువ్వు ఆలోచించే మాట్లాడుతున్నావా?''

"అంటే? సుశీల నీ జీవితానికేవిధంగానూ పనికి రాదనే నీ ఉద్దేశ్యం?''

"అయితే మాత్రం?''

"మరి సుశీలని పల్కరించి కబుర్లు చెప్పటంలో నీ అభిప్రాయం?''

భాస్కరం మాట్లాడలేదు.

"పెళ్లికాని ఆడపిల్ల కనపడితే వెంటాడటం కాలక్షేపానికేనా?''

"ఇందూ!''

"ఏం అన్నయ్యా? అన్యాయంగా అంటున్నానా? సుశీలని పల్కరించాలని తహతహలాడి పోయావ్. తీరా ఎదరపడగానే ఉన్నవీ లేనివీ కల్పించి చెప్పావ్. పెళ్లివరకువస్తే నసిగేస్తున్నావ్. మరి ఆవిడపట్ల నీ ఇష్టం ఎటువంటిది? ఆవిడ స్నేహం కోరటంలో నీ అభిరుచి ఏ తరహాది? నిన్ను నిర్మొహమాటంగా అడుగుతున్నా నన్నయ్యా!''

"నన్ను అపార్థం చేసుకున్నావు ఇందూ! నాలో చెడ్డభావం ఎప్పుడూ లేదు. ఏదో సరదాగా పలక రించావంతే.''

"అదే అన్నయ్యా నీ తప్పటడుగు. ఆడపిల్ల జీవితం నాశనం కావటానికి ఆమాత్రం చాలు. నీ స్నేహం బలపడి చెడు మార్గాలు పట్టవచ్చు. వివాహానికి కనుకూలంగాలేని నీమీద సుశీల లేని పోని ఆశలు పెట్టుకోవచ్చు. కాదంటావా? అప్పుడేమౌతుంది? నీ సరదా ప్రాణసంకటం కాదా?''

"..........................''

"మాట్లాడవేం అన్నయ్యా! సుశీల తిరిగి జవాబులివ్వకపోయినా ఆమెతో మాట్లాడుతూ పోవడం నీకు సంతృప్తిగా లేదా? బాగా ఆలోచించు అన్నయ్యా! సుశీల ఎంతో తెలివైంది. చురుకైంది. అన్ని పనులూ చెయ్యగలదు. ఎన్ని బాధ్యతలైనా నిర్వహించుకోగలదు. నీ వంటి వ్యక్తి సుశీలని దయ తల్చటం మాత్రం ధర్మంకాదా అన్నయ్యా?''

భాస్కరం కొంతసేపు మౌనంగా ఉండి అన్నాడు.

"అమ్మ ఒప్పుకుంటుందా?''

"అసలు నీకు ఇష్టమయిందా? ఆవేశంలో అంగీక రిస్తున్నావా? కేవలం సానుభూతితోగాక సుశీలని ఇష్టంతోనే స్వీకరించాలి సుమా! ఆ బరువు బాధ్యత లన్నీ నీవి. బాగా ఆలోచించి చెప్పు.''

అది ఇందుకు నా ఇష్టం.

"మనస్ఫూర్తిగా చెప్తున్నావా? నిన్నెవరూ బలవంతం చెయ్యటంలేదే, నువ్వు కోరి చేసుకుంటా నంటేగాని, ఆవిడ అన్నలుకూడా అంగీకరించరు.''

భాస్కరం నవ్వాడు.

ఆ వేసంగిలో భాస్కర్ సుశీలల వివాహం కన్నుల పండువుగా జరిగింది.

* * *

విధి లీలలు విచిత్రమైనవి! భగవంతుడు దయామయుడు! అన్న సూక్తులు ఎంత మాత్రం అసత్యాలు కావు. భవిష్యత్ జీవితం అనామకం కావున్నప్పుడే అనుకోకుండా దానికి అడ్డు కట్టపడుతుంది. దుఃఖపూరితం కావలసిన బ్రతుకులు మరో మార్గంలో నడిచి చివరికి స్వర్గధామాలు చేరు కుంటాయి. అది గ్రహించలేని సామాన్యులు తాత్కాలికంగా చెడిన బ్రతుకుల్ని— శపించిన దైవాన్ని బాధాపూరిత హృదయాలతో నిందించు కుంటారు. వోడలు బళ్లూ— బళ్లు వోడలూ కావచ్చుననే లోకోక్తి కరుణా సముద్రుడైన భగవంతుని చిద్విలాస పూరితమే కావచ్చు.

కనిపెంచిన తల్లిదండ్రుల్ని సుఖసంతోషాలివ్వగలిగే ఆస్తిపాస్తుల్నీ గోల్పోయి అనాథలై రోజులు యుగాలుగా గడుపుకున్న సూర్యం, మధూ, సుశీలల జీవిత మార్గాలు సువిశాలమైన రాజబాటలో కలిసిపోయాయి.

సూర్యం—అనుకూలవతియైన భార్యతో కుడి ఎడమ నేత్రాలవంటి బిడ్డలతో సంతృప్తికరమైన

తలుపులు తెరుచుకుని బయలుదేరి పోతున్నాడు.

సుశీల— కావలసినవారంతా రోసిన సుశీల— విద్యాధికురాలై తన భర్తచేత అపురూపంగా ప్రేమించబడుతూ—కన్న కూతురి ఆట పాటలతో ఇహ ప్రపంచమే మర్చిపోతూ—శర వేగంతో జీవితంలో పరుగులు పెడుతోంది.

మధు చిన్ననాటి నుంచీ విశిష్టమైన వ్యక్తిత్వం గల మధు—మొదటి శ్రేణిలో బి. ఎ. పరీక్ష పాసై అంతులేని ప్రశంసలు అందుకున్నాడు. ఆర్థిక ఇబ్బందులవల్ల లాయర్ కావాలనే వాంఛను తాత్కాలికంగా అరికట్టుకుని యు. పి. ఎస్. సి. పరీక్షకు కూర్చుని విజయం సంపాదించాడు. విశ్వనాథం వంటి అనూయాపరులకు విభ్రాంతి కల్గించేలా కో ఆపరేటివ్ సొసైటీలో ఒక ఆఫీసరై పోయాడు.

సుధ అకస్మాత్తుగా జబ్బు పడటంతో న్యాకలు ఫైనల్ పరీక్షలకు హాజరుకాలేకపోయింది ఒక సంవత్సరం—రెండోసారి రాసినా విజయం సంపాదించలేకపోయింది. సుధతోపాటు యింటిల్లిపాదీ నిరుత్సాహపడిపోయారు. సుధను సోదార్చి ప్రోత్సహించినవాళ్లు లేకపోయారు. సుధ వూహాలోకాలలో కట్టుకున్న గాలిమేడలన్నీ చూస్తుండగానే మాయమై పోయాయి. సుధ కళ్ల నీళ్లు నింపుకోవటం తప్ప ఏమీ చెయ్యలేకపోయింది.

సాధ్యమైనంత తొందరలో సుధా మధులకు పెళ్లి



సెయ్యాలని సుందరమ్మగారి ఆరాటం. ఆవిడ బాగా ఒంగిపోయింది. పళ్లు వూడిపోయి—కళ్లు కన్పించక మూడుకాళ్ల ముదుసలైపోయిన సుందరమ్మగారికి తనేక్షణంలోనైనా రాలిపోవచ్చు ననే అనుమానం బలంగా ఏర్పడిపోయింది.

"మధూ ! ఇంకా నీకు చిన్నతనమేనట్రా ? పెళ్లి చేసుకోవూ ?"

"ఉండవే అమ్మమ్మా ! ఇప్పుడేం తొందర పెళ్లికి ?"

"పండుటాకు ఎన్నాళ్లు రాలకుండా ఉండి పోతుందిరా ? నీ పెళ్లి నన్ను చూడనివ్వవురా మధూ ?"

"అయితే అదేదో నీ చేతులతోనే చేసెయ్యవే. నువ్వు లేకపోతే నేను పెళ్లే చేసుకోను."

రోజు కోసారైనా ఆవాదన జరిగి బోసినోటితో నవ్వుకుంటేగానీ సుందరమ్మగారికి తృప్తి ఉండదు. ఆవిడ చిన్నకొడుకు దగ్గిర కూడా అలాగే పోరు పెడుతుంది. "ఏం చదువుట్రా నాయనా ? లక్షణంగా పిల్లకి పెళ్లి చేసుకోక."

"అన్నయ్యే చూస్తాడులేవమ్మా అంతా."

"నువ్వో పిచ్చి నన్నాసివి. నీ బిడ్డ విషయం నువ్వు చూసుకోక అన్నయ్య మీదైతే మాత్రం ఎందుకు పెట్టాలిరా ? వాళ్లిద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది. ఏమంటాడో ఏమిటో !"

"ఏమోనమ్మా ! అంతా అన్నయ్య ఇష్టమే. ఆ మంచిచెడ్డలన్నీ వాడి కెందుకు తెలియవు ?"

సీతాపతి తన సంసార బాధ్యతంతా అన్నగారి మీద ఏనాడో వదిలేశాడు. ఈనాడు సుధ పెళ్లి విషయంలో కూడా తనకై తను నిర్ణయించ దల్చుకోలేదు. మధుని అల్లుడుగా చేసుకోవాలనే మాట అన్నగారి నోటిమీదుగానే విని తనూ తల వూపటానికి సిద్ధంగా ఉన్నాడు.

సుందరమ్మగారి ప్రోద్బలంతో—సూర్యం మేన మామల దగ్గిరికి బయల్దేరాడు. సీతాపతీ విశ్వనాథం పార్వతీ, సావిత్రీ అంతా ఉండవలసిన పెద్ద మనుషులంతా ఉన్నారు.

"బావున్నావా సూర్యం ? పిల్లలూ వాళ్లూ కులాసాయేనా ? బొత్తిగా రావటమే లేదేం ?"—వంటి సర్వసామాన్యమైన పలకరింపులు ముగి శాయి. సూర్యం ఎందుకు వచ్చాడో అందరికీ తెలుసు. అందరికీ తెలుసన్న సంగతి సూర్యానికీ తెలుసు. అయినా ఎవ్వరూ ఆ ప్రసక్తి ఎత్తక పోవటంతో సుందరమ్మగారు కలగజేసుకోక తప్ప లేదు—

"విశ్వం ! సూర్యం పెళ్లి విషయం మాట్లాడ టానికే వచ్చాడురా !"

విశ్వనాథం తల్లికేసిచూశాడు. "ఏం పెళ్లమ్మా?"

"అదేవిట్రా బొత్తిగా తెలీనట్టు అడుగు తున్నావ్ ? ఈ ఏడాదైనా సుధ పెళ్లి చెయ్యవూ? వాడి ఉద్యోగం ఎలాగూ ఖాయపడింది. ఇద్దరికీ వయసూ వచ్చింది. ఆ మూడు ముళ్లూ వేయించి అయిందనిపించేస్తే" సుందరమ్మగారు ఏదో పెద్ద భారం దిగిపోయినట్టు నిట్టూర్చింది.

"సుధ పెళ్లిమాట నాతో చెప్పట మేమిటి ? తల్లిదండ్రులుండగా మధ్య నేనా పెళ్లి చేసేవాణ్ణి ?"

# కూలిన గోడలు

"అదేమిటన్నయ్యా అలా అంటావు ? సుధ పెళ్లి నీ యిష్టంమీద కాకపోతే ఇంకెలా జరుగు తుంది ? ఏనాడూ నీమాట నేను వ్యతిరేకించలేదు." సీతాపతి అన్నగారికి కోపం రానివ్వకుండా మాట్లా డాడు. తనేమీ పట్టించుకోదల్చలేనట్టు—"అబ్బే! అదేం మాటరా ? నీ పిల్ల పెళ్లికి నా పెత్తన మేమిటి మధ్య ? నీ యిష్టమైనట్టే మాట్లా డుకో" అన్నాడు విశ్వనాథం.

సీతాపతి అన్నగారి మొహంలోకి చూస్తూ అన్నాడు.

"ఏనాటినుంచో నా మంచి చెడ్డలన్నీ నీమీద పెట్టా నన్నయ్యా ! నీ యిష్టంలేకుండా సుధ పెళ్లి చేస్తానని మాత్రం అనుకోవద్దు." విశ్వ నాథం మరీ తెలివితక్కువగా ప్రవర్తించడనే సీతా పతి ఉద్దేశ్యం.

గడప కవతలగా కూర్చున్న సావిత్రి కూడా బావగార్ని ఉద్దేశిస్తూ అంది—"నేను గానీ, మీ తమ్ముడు గానీ మీ మాట వినమనేనా అంత కష్టంగా మాట్లాడుతున్నారు ? అంతా మీ చేతు

ఒకడు : మీ భార్య చాలా గయ్యాళి అని విన్నాను !

రెండోవాడు : బహుశ నిజం కాక పోవచ్చు, కాని మూడ్రోజుల్నుంచీ నాకు జలుబు చేసి గొంతురాసుకు పోయిన సంగతి మాత్రం ఆమెకి తెలీదు !

ఎం. పురుషోత్తమ్. నాయుడు

ల్లోనే ఉంది. మీ యిష్టమైనట్టే చేయండి. కాదనే దెవరు ?"

విశ్వనాథానికి బాగా ధైర్యం వచ్చింది—

"ఇష్టాని కేముందిలే. పెళ్లంటే బొమ్మలాట కాదుగా ? పిల్ల కష్టసుఖాలు ఆలోచించాలి గానీ మర్యాదలకీ మొహమాటలకీ పోతే పిల్లేదు మరి." ఆ ఉపోద్ఘాతం ఏ ప్రస్తావనకు నాందో ఎవరికీ అర్థం కాలేదు—విశ్వనాథం దీర్ఘంగా ఆలోచిస్తున్న వాడిలా కూర్చున్నాడు. చివరికి సీతాపతికేసి చూస్తూ—"సుధని వాడికిచ్చి పెళ్లి చెయ్యటం నాకేం యిష్టంలేదురా ! తర్వాత నీ యిష్టం." అనేశాడు. ఒక్కసారిగా గాలి స్తంభించిపోయినట్టు ఉక్కిరిబిక్కిరయ్యారు అంతా.

"విశ్వం ! ఏవిట్రా నువ్వన్నది ?" ఆదుర్దా పడింది సుందరమ్మగారు.

"అవునమ్మా ! ఆ రౌడీ వెధవకి సుధ నివ్వటం నా కెంతమాత్రం యిష్టంలేదు."

"మామయ్యా !" సూర్యం హెచ్చరికతో విశ్వ నాథం రెచ్చిపోయాడు. "ఇక మాట్లాడక్కర్లేదు. నీ తమ్ముడికీ నా కూతురికీ పెళ్లి జరుగుతుందని కలలో కూడా అనుకోకు. అంతే."

"ఏం ? ఎందుకని ?"

"ఎందు కేమిటి ? చిన్నా పెద్దా అనకుండా వాడొక మేకులా పొడవస్తుంటే నాకేనా అంత సిగ్గులేదు ?"

"చిన్నవాడితో పాటు నువ్వూ తొందరపడకు విశ్వం ! ఇంతకాలానికీ పెళ్లి వద్దనుకుంటే సమం జసంగా ఉంటుందా ? కల్యాణి కోరికైనా ...."

"ఆఁ పోనిద్దూ ! కోరికలకేం ? నాకూ ఉన్నాయి. జరిగినప్పుడు కదా ? చచ్చినవాళ్లకేం ? బతికిన వాళ్లని కూడా తన్నుకు చావమంటారు."

సూర్యం శాంతంగానే అన్నాడు—"మధుకి పెళ్లి కాదని నిన్నడగటానికి రాలేదు మామయ్యా! ఈ పెళ్లి జరగటం అన్ని విధాలా మంచిది. మా అమ్మ కోరిక తీర్చవలసిన బాధ్యత ముఖ్యంగా నామీద ఉంది. అందుకే నాకై నేను మీ దగ్గిరికి వచ్చాను."

"వస్తే వచ్చావ్‌లే. వచ్చినట్టే వెళ్లు." విశ్వ నాథం వెటకారంగా అని లేచాడు—"సీతాపతి ఆ బాధ్యతేదో నామీద పెట్టాడు. సుధ మంచి చెడ్డలు చూడవలసిన పని నామీదా ఉంది. నీ తమ్ముణ్ణి చేసుకుని మా పిల్ల బాగుపడిపోయేదేం లేదని మాకు బాగా తెలుసు. నువ్వు లక్ష రూపా యలు ఎదురిచ్చినా సుధని వాడికి చెయ్యం. సరేనా ?"

"మామయ్యా ! నీకు యిష్టం లేకపోతే ఆమాట చెప్పేస్తే సరిపోతుంది. ఎదటివాళ్లని అవమానంచేసి పంపితే రేపు నీకు జరిగేది కూడా అదే. సరే ! నేను వెళ్తున్నాను." సూర్యం లేచాడు.

సీతాపతి గుండెలు కొట్టుకున్నయ్. "ఒరేయ్ సూర్యం ! కంగారు పడకురా కూర్చో !" అనగలి గాడు నెమ్మదిగా.

సూర్యం గుమ్మంలో నిలబడే అన్నాడు—"మధుకి తెలీకుండానే నేను వచ్చాను మామయ్యా ! నా తప్పు లేకుండా అడిగిచూశాను. నీ కూతురి పెళ్లి విషయం నీది కానప్పుడు యిక నే నిక్కడ నిలబడవలసిన అవసరంలేదు."

సీతాపతేమీ మాట్లాడలేదు.

విశ్వనాథం వ్యంగ్యంగా అన్నాడు—"నీ తమ్ముడొక్కడే నీ మాట విని అన్నగార్ని అందలం ఎక్కిస్తాడనుకుంటున్నావు కాబోలు."

"చినమామయ్యా ! నువ్వు నీ అన్నమాటే విను. నేను వెళ్తున్నాను." చరచరా మెట్లు దిగి వెళ్లి పోయాడు—సీతాపతి కొయ్యబారిపోయాడు. అంతా క్షణాలమీద జరిగిపోయింది.

సుందరమ్మగారు నెత్తీ నోరూ బాదుకుంది. "అయ్యో దేవుడా ! ఇక ఈ రెండు కుటుంబాలూ ఎప్పుడు కలుసుకుంటాయిరా విశ్వం ?" అంటూ వాపోయింది—"బతుకంతా చిన్నతనమేనా ? లేనట్నుంచీ వాడే మంచివాడౌతాడు. కావలసిన వాళ్లని దూరం చేసుకుంటే ఏముందిరా నాయనా ?"

విశ్వనాథానికి చిరాకు వేసింది. "ఏదో జరిగి పోయినట్టు నువ్విలా గొడవచెయ్యకమ్మా ! ఇంతటి మొనగాడూ దాటిపోతే సుధకి పెళ్లి కాదనేనా

# కూలిన గోడలు

మీ అందరి భయం ? ఏంరా సీతాపతీ ? ఆ మధుగాడి కిచ్చి చేద్దామనే ఉందా నీక్కూడా ?" మధుపట్ల అన్నగారి ద్వేషం హర్షించలేని సీతాపతి నోరు పెగుల్చుకొని మాట్లాడాడు—"ఎంతైనా వాళ్లు మనకు కావలసిన వాళ్లన్నయ్యా ! వాణ్ణి కాదని ఏం చేసినా లోకులు మననే అంటారు."

"ఇదిగో ఇలాంటి డొంకతిరుగుడు కబుర్లు నాకు పనికిరావు. నీ ఉద్దేశ్య మేమిటో తేల్చి చెప్పు."

"చెప్పటాని కేముంది ? మధు మంచి ఉద్యోగం చేసుకొంటున్నాడు. కావలసినవాడు. సుధ నిచ్చి పెళ్లి చేద్దామనే ఉంది."

"అలాంటప్పుడు నీ యిష్టం నీ యిష్టం అని నక్క వినయా లెందుకురా ? ఆ మధుగాడు నన్నెన్ని మాట లన్నాడో మర్చిపోయావు కదూ ? అవున్లే. నీకు గుర్తు ఉంచుకోవాల్సిన అవసర మేముంది? మీరంతా ఒకటి—ఎటొచ్చి నేనే ...."

"అన్నయ్యా ! నీకంటే మధు నాకు ఎప్పుడూ ఎక్కువ కాదు. ఎవర్ని వదులుకోవాలా అన్న ప్రశ్న వస్తే వాణ్ణే వదులుకుంటాను. కాని.... ఒక్కటి ఆలోచించన్నయ్యా ! వాడు చిన్నవాడు, మన కృష్ణుడిలాంటివాడే. కృష్ణుడెన్ని ఆకతాయి పనులు చేస్తే మనం సహించటంలేదు ?"

"దానికీ దీనికీ ముడిపెట్టకు. నా కంఠంలో ప్రాణం ఉంటే వాడు కూసిన కూతలు మర్చిపోను. పెద్దవాణ్ణని కూడా ఆలోచించకుండా నోటి కొచ్చినట్టూ వాగాడే ! వాడి కాళ్లు కడిగి కన్యాదానం చెయ్యమంటావా ? అది నావల్లకాదు."

"........."

"ఆ రౌడీవెధవకి కట్టబెడితే సుధ సుఖపడుతుందనేనా నీ ఉద్దేశ్యం ? ఎంత తెలివైన పిల్లయితే మాత్రం వాడి మంకుతనం ముందు ఎలా నెగ్గుకొస్తుంది ? చీటికీ మాటికీ మనమీద కోపం దానిమీద తీర్చుకుంటాడు కూడా."

".........."

"ఎటొచ్చి వాడిపాటి ఉద్యోగం వెలగబెట్టేవాడు రాడనేగా మీ భయం ? ఆ పూచీ నాది. వాడి తల దన్నినవాణ్ణి తీసుకొచ్చి మూడోనాటికి ముడేయిస్తాను."

"కాదన్నయ్యా ! కల్యాణి కూడా ...."

"చెప్పానుగా ? సామరస్యంగా ఉన్నప్పుడు ఎన్నైనా అనుకుంటాం. బ్రతికిఉన్న వాళ్ల కోరికలే తీరటంలేదు. ఇక చచ్చినవాళ్ల మాటేమిటి ? లోకం గొడ్డుపోయిందిట్రా సీతాపతీ ? సుధకి లక్షణంగా పెళ్లిచేసే బాధ్యత నాదేనని చెప్పటం లేదూ ? నీ పిల్లలు నా పిల్లలు కారని ఎన్నడైనా అనుకున్నానా ?—నువ్వేదో భ్రమపడుతున్నావుగానీ బంగారం బొమ్మలాంటి పిల్లని వాడికి కట్టబెట్టి రేపు కష్టానికీ సుఖానికీ వాడికి నచ్చజెప్పగలమా ?"

"........."

"ఏవిట్రా ? నీ ఉద్దేశ్య మేమిటో తిన్నగా చెప్పు. నీ పిల్లల్ని నీయిష్టం వచ్చినట్టు చేసుకుంటానంటే నే నెవణ్ణి మధ్య ఆపటానికి ?"

సీతాపతి మాట్లాడకుండానే సావిత్రి అంది—"మీ యిష్టం వచ్చినట్టే చెయ్యండి. మేమెలా కాదంటాం ? దాని మంచి చెడ్డలు మీకు తెలీవు గనకా ?"

సీతాపతి నీరసంగా లేచి గదిలోకి వెళ్లిపోయాడు—సావిత్రి లోపలికి వచ్చి భర్తకు జ్ఞానబోధ చేసింది—"దానికి పెళ్లిచేసే బాధ్యత తనదే నంటున్నారుగా ? ఆయనకేం పేరు లేదా ? ప్రతిష్ఠ లేదా ? ఇంతకన్నా మంచి సంబంధమే తేగలరు—ఇంతమాత్రానికి ఆయన మాట తోసిపుచ్చటమేమిటి ? ఆయనకు లొంగిఉండాల్సిన అవసరం మనకే ఉంది మరి. మీకు మాత్రం తెలీని దేముంది ?"—బావగారి ఆస్తి పరాయివాళ్లే పరూ తన్నుకుపోకుండా తగినన్ని కట్టుదిట్టాలు చేస్తూ—కావాలసినన్ని ఉపాయాలు ఆలోచిస్తూనే ఉంటుంది సావిత్రి—పిల్లల తల్లి !

"అయితే సుధ ఏమంటుంది ?" ఆశగా చూశాడు సీతాపతి—"దాన్ని అడిగావా ?"

"దాని మొహం ! మొదటినుంచీ ఆ పిల్లాడంటే దానికేం లక్ష్యంలేదు."

"సరే ! మీ అందరికీ యిష్టమైతే ఇక నాదేముంది ?" ఉదాసీనంగా అన్నాడు సీతాపతి.

*　　*　　*

ఆవిషయం విన్న మధు ప్రశాన్తడిపోయాడు. రెప్పపాటులేకుండా తీక్షణంగా చూస్తూ నిలబడిపోయాడు — తనకు సుధనిచ్చి పెళ్లిచెయ్యటానికి మామయ్య తిరస్కరించాడా ? పైగా తన తలదన్నేవాణ్ణి తెచ్చి మరీ చేస్తానన్నాడా ?

ఆ రోజంతా ఏదో పోగొట్టుకున్నట్టు మధుకేమీ తోచలేదు. తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. సుధకి తనంటే ఇష్టంలేదా ? కాకపోతే తననే చేసుకుంటానని ఎందుకు చెప్పలేదు ? ఒక్కసారి సుధతో మాట్లాడితే.....? ఎందుకూ మాట్లాడాలి....? ఆలోచనా పరంపరతోనే రెండు రోజులు గడిచాయి. రాత్రి బ్రైన్‌కెళ్లటానికి మధు పెట్టె సర్దుకొంటూంటే సీతాపతి వచ్చాడు. మధు మొహంలోకి చూడలేనివాడిలా మొహం దించుకునే అన్నాడు: "నీతో కొంచెం మాట్లాడాలి మధూ ! అలా వస్తావా ?"

మధు సర్దుకుంటూన్న వస్తువులన్ని ఎక్కడవక్కడ వదిలేసి సీతాపతి వెనక నడిచాడు. రోడ్డు కవతల చింతచెట్టు కిందికిపోయి నిలబడ్డాడు సీతాపతి. మధు చేతులూ రెండూ పట్టుకున్నాడు—

"కోపం తెచ్చుకోకుండా నా మాట వింటావా మధూ ? ఇవి చేతులుగావు. ....."

"ఛ ! అవేం మాటలు మామయ్యా ? నీ మీద నేనెప్పుడైనా కోపం తెచ్చుకున్నానా ? ఫర్వాలేదు చెప్పు మామయ్యా !"

"సంగతంతా నీకు తెలుసు మధూ ! సుధని పరాయిచోట ఇవ్వటం నాకేమీ ఇష్టంలేదు. కాని ఏం చెయ్యను ? పిల్లలు గలవాణ్ణి......"

అర్ధోక్తిలో ఆగిపోయాడు సీతాపతి.

"నేనేం చెయ్యగలను ?" ఆశ్చర్యంగా చూశాడు మధు.

"నా ఉద్దేశ్యం గ్రహిస్తే ఇలా మాట్లాడలేవు మధూ ! అన్నయ్యకి నేను చెప్పి ఒప్పించలేను. వాడితో ఘర్షణపడి వదులుకోనూలేను."

"అవున్లే ఆ ఆస్తి నీకు దక్కదనే నీ భయం ?"

"కాదా మధూ? నా బాధ అర్థంచేసుకుంటే నువ్విలా ఎత్తిపొడుస్తావా?"

"అయితే మామయ్యా! పెద్ద మామయ్యకే పిల్లలుంటే నువ్వేం చేసేవాడివి?"

"అదివేరే సంగతి. అప్పటి పరిస్థితులు ఇలా ఉండనేవుండవు— శిష్టకాలంలో ఈ దెబ్బ కూడి పోతే మనమేం చేస్తాము? పారిపోగలమా?"

"అయితే నన్నేం చెయ్యమంటావు మామయ్యా" మధుకి సీతాపతిని చూస్తోంటే మనస్సంతా కరిగి పోయింది. తిండీ నిద్రా లేనివాడిలా నీరసంగా బడలికగా ఆయాసపడుతూ మాట్లాడుతున్నాడు సీతాపతి— "నా మీద దయయుంచి చిన్న సహాయంచెయ్యి మధూ! కోపం తెచ్చుకోకు. పెద్ద వాళ్ళని క్షమాపణ కోరటంలో తప్పులేదు. ఒక్క సారి అన్నయ్య దగ్గరికివచ్చి........"

"మామయ్యా!" ఆశ్చర్యంగా చూశాడు మధు— "పెద్ద మామయ్యని క్షమాపణ కోరమంటు న్నావా?....నన్నా"

"మరోలా అనుకోకు మధూ! నీకై నువ్వు అడిగితే అన్నయ్య ఒప్పుకోవచ్చు."

"ఒప్పుకోవచ్చు. అంతేనా? ఒప్పుకుంటాడా?"

"కాదు. ఒప్పుకుంటాడు. తప్పకుండా ఒప్పు కుంటాడు."

"మామయ్యా! నీకిది ధర్మంగా ఉందా? నేనేం తప్పుచేశానని క్షమాపణ కోరమంటున్నావు?"

"నువ్వేమీ అక్రమంగా ప్రవర్తించలేదని నాకు తెలుసు మధూ! అయినా......"

"క్షమించు మామయ్యా! అది నావల్లకాదు. నా వ్యక్తిత్వం చంపుకుని ఈ పని నేను చెయ్యలేను."

"నువ్వలా అంటేకాదు మధూ! సుధ జీవితం పరాయివాళ్ళ పాలు చేస్తావా?"

మధు భారంగా నవ్వాడు— "పితృ్రడి హృదయం ఎంతైనా క్షోభిస్తుంది. మామయ్యా! సుధకే ఈ పెళ్ళిమీద లక్ష్యం లేనప్పుడు....."

"అది ఒట్టి పిచ్చిది. దానికేమీ తెలీదు. పెద్దయ్యమాటలే దానికి సర్వస్వంగా కనిపిస్తాయి. అంతమాత్రాన దాన్ని విసర్జించటమేనా? ఆలోచించు."

"నీ మాట నేనేది కాదననుకాని నువ్వు చెప్పిన పనిమాత్రం చెయ్యలేను— పెద్దమామయ్య ఆ రోజు మా అన్నయ్యనెంతో అవమానంచేసి పంపాడు. దానికి తనే మాకు క్షమాపణ చెప్పుకోవాలి. పైగా నన్ను నువ్వు నిర్బంధించటం— వద్దు మామయ్యా! అది కలలోకూడా జరగదు. నీ మీద నాకెంతైనా సానుభూతి ఉందిగాని అది వినియోగించే మార్గం లేదు— "నన్ను అపార్థంచేసుకోకు. నువ్వు వెళ్ళిపో."

"మధూ!"

"అంతే మామయ్యా! నన్ను క్షమించు."

సీతాపతి హతాశుడైపోయాడు. మధు భారంగా అన్నాడు— "నేను ఈ రాత్రికే వెళ్ళిపోతున్నాను. సెలవులేదు. సుధ సుఖంగా ఉండటమే నాకు కావాలి. వాళ్ళ ఇష్టప్రకారమే చేసుకోనీ."

(సశేషం)

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# దీపావళి కథల పోటీ

## ముగింపు తేదీ 1-10-'64

- నవంబర్ నెలలో వెలువడే ఆంధ్ర సచిత్ర వార పత్రిక తొలి సంచిక దీపావళి ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సందర్భంలో ఎప్పటికిమల్లే యీ ఏడాదికూడా 'కథలపోటీ' నిర్వహిస్తున్నాము. మంచి కథలకు మరింత ప్రోత్సాహం యిచ్చే నిమిత్తం బహుమతులను పెంచడం కూడా చేస్తున్నాము.
- మొత్తం మూడు బహుమతులుంటాయి. బహుమతి పొందిన కథలకు చెందిన సర్వహక్కులు, ఆంధ్ర సచిత్ర వారపత్రికవై వుంటాయి.

## మొదటి బహుమతి రు. 900 లు
## రెండవ బహుమతి రు. 500 లు
## మూడవ బహుమతి రు. 350 లు

- ఇతివృత్తం తెలుగు జీవితానికి సంబంధించినదై వుండాలి.
- కథ అరఠావు సైజు కాగితాలపై ఒకవేపు సిరాతో రాసిపంపాలి. పన్నెండు పుటలకు మించరాదు.
- పోటీకి గడువు అక్టోబర్ ఒకటవ తేదీ. అంటే మా కార్యాలయానికి అటుపై చేరిన రచనలు ఎంతమాత్రమూ పోటీకి స్వీకరింపబడవు. తమ తమ రచనలు తిరస్కరింపబడినప్పుడు తిరిగి పొందాలని కోరేవారు తమ రచనలతోనే తగినన్ని తపాలాబిళ్లలు జతపర్చిన చిరునామాగల కవరులను పంపడం తప్పనిసరిగా భావించాలి.
- పోటీ విషయంలో ఎట్టి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. అనువాదాలు, అనుకరణలు పనికిరావు. రచనలు సొంత రచనలై తీరాలి. సంపాదకుల నిర్ణయమే తుది నిర్ణయం.
- ప్రతి రచయిత తన రచనలతోపాటు (1) కలం పేరుతో రాస్తే అసలు పేరు (2) కథ తన సొంతమేనని తెలిపే ఒక హామీ, పూర్తి చిరునామా విధిగా పంపాలని గ్రహించగోరుతున్నాము. పోస్టేజీ లేని రచనలు ఎంతమాత్రము త్రిప్పి పంపబడవు.
- పోటీలో బహుమతులను పొందిన కథలు మూడూ; నవంబర్ 6 దీపావళి ప్రత్యేక సంచికలో వేస్తాము. పోటీలో బహుమతులను పొందని కొన్ని రచనలను కూడా సచిత్ర వారపత్రిక ఇతర సంచికలలో ప్రచురణార్థం స్వీకరించడం జరిగితే ఆయా రచనలను మామూలు రచనలుగానే స్వీకరించడం జరుగుతుంది. వాటికి యథోచిత పారితోషికం యివ్వడం జరుగుతుంది.
- కవరుపై "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. రచనలు "సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక: 7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1" చిరునామాకే పంపాలి. వ్యక్తుల పేర్లతో పంపే రచనలు ఎంతమాత్రమూ ఆమోదింపబడవు.

## ముఖారి

10 వ పేజీ తరువాయి

కులికి నందుకు శిక్ష అనుభవించు అన్నాడు. కాని ఆ వీణను కటిక కసాయిగా తెగేదాకా పలికించుకున్నాడు. 'నీ జాతి నీ నీతి ఇంతే — నీ కథా యింతే' నన్నాడు. కెవ్వుమన్న తన కేక తనకే వినిపించింది. అటు తర్వాత తొలి మనువు కుదిరి తాళి కడదామనుకున్నవాడే తనను రాజు పక్కగా జేరి ఎగతాళి చేసినందుకు కక్ష కట్టాడు. అప్పటికే కృష్ణహరి కిష్కులో కలిసిందని తెలిసింది. 'అనుభవించు' అని అనుభవించి పోయాడు.

కసి పట్టిన వాళ్లంతా 'అనుభవించు' అంటూ అనుభవించి వెళ్లి పోయారు.

వసంతాలు వచ్చినా, చచ్చినా వీణ తీగెలు తెగి మూగ పోయింది.

మనువు కుదిరినా మనసు దాన మడిగితే దేవర మాట దేవుడి మాటనుకుని యిచ్చి నందుకా! నమ్మి చెడి పోయింది........ పగిలిపోయింది వీణ—

సాని వాడంతా జేరి ఈ చచ్చిన్దాని మళ్లే ఈ వాడకంతా పరువు కరువై మోహం బరువై పోయిందని ఆడి పోసుకుంది. చిందొరకిదే మందు పెట్టిందని మతి విరిచిందని పాలు పోసిన వాడిని పాన్పై కరిచిందని నోరాడిందల్లా నోనాడి జాలీ నీ దాని జోలినీ కూడా పోనాడి మరీ మాటాడింది బరి తెగించిన సాని వాడ.

రాజుకు లోకువై నమ్మి రాలుగాయలకంతా లోకువైంది.

సానివాడ వీణను తరిమి వేసే నాటికి ఆమెకు ఈ అవమానాలతో, అభిమానాలతో పనే లేదు. ఆమె పిచ్చి ఆమెకు ఆనందమిచ్చింది.

ఇటుపైన యువరాజును పట్టుడి చేసి తనపైన తొలి పగ దీర్చుకున్న కార్చిచ్చు అలనాడు యువరాజు కోసమే తీరమాడి కృష్ణహరితో మాట కుదుర్చుకున్న వాడేనని తన ముందే చెప్పుకున్నా వీణకు తెలియకుండా పోయింది.

ఆ కట్ట బెట్టిన మడీ వాడి పరమే అయింది. వాడు ఇటు యువరాజుకు నమ్మకస్తుడు, అటు పెదరాజుకూ నమ్మినబంటు. చిందొర మీద విశ్వాసంతో మాట కలిపాడు. పెద్దొరకు విశ్వాసపాత్రుడు గనుక మంట కలిపాడు. కొందర్ని తప్పు పట్టుకోడం లోకానికి చేతకాదు. వాళ్లు ఎప్పుడూ పెద్ద మనుష్యులే.

కృష్ణ ఒడ్డున హంసల దీవి తిరునాళ్లకు పోతూ వస్తూ ఎందరో భారీవాహ సార్థవాహులు ఆబాల గోపాలం తరిగొప్పుల హోరు గాలికి నల్లే గాలి గోపురం పడి పోతున్నట్లు పిచ్చిగా పరుగెత్తే అరువ దేండ్ల అస్థి పంజరాన్ని చూసి కన్నీటి చుక్కలు రాల్చడం కద్దు.

అదీ వద్దు అన్నట్లు ఒక సంధ్యా సమయంలో హోరు గాలికి గత ప్రాణమైన ఆ వీణ కృష్ణలో ఒరిగి పోయింది.

సాగర సంగమం వద్ద అందుకే యిప్పటికీ కృష్ణమ్మ వీణగా పలుకుతుంది. ★

# కర్మసిద్ధి

ముద్దా శాస్త్రిబాబు

## 19

సింధురాజు వినటానికి సిద్ధమయ్యాడు.

శుక్రాచార్యుడు గొంతు సవరించుకుని, కథ ప్రారంభించాడు—

'సింధురాజా!— విను ! ఇవాళ కైలాసంలో ఒకచిత్రం జరిగింది. బాల వినాయకుడు తన ఈడు కుర్రవాళ్లతో ఆడుకుంటున్నాడు. ఆ సమయంలో ఒక నగల వర్తకుడు అటువేపుగా వచ్చాడు. పిల్లలతో ఆడుకుంటున్న గణపతిని అమాంతంగా ఎత్తుకుని ముద్దాడాడు.

తరవాత ఒకచెట్టుకింద కూచుని, తను తెచ్చిన మూట విప్పాడు. అందులోంచి ఒక అపూర్వమైన గజ్జెల జతతీసి, దాన్ని గణేశుడి కాళ్లకు తొడిగాడు. లయ, తాళంవేస్తూ, నగలవర్తకుడు ఒక చక్కటి పాట ప్రారంభించాడు.

వర్తకుడు పాట ప్రారంభించేసరికల్లా, పాటకు సరిగ్గా సరిపోయ్యేట్టు బాల వినాయకుడు నృత్యం చెయ్యసాగాడు. పిల్లలంతా నిశ్చేష్టులై నిలబడి, ఆ నృత్యంచూసి ఆనందిస్తున్నారు.

మెల్లిమెల్లిగా తప్పటడుగులతో ప్రారంభించిన ఆ నృత్యాన్ని, పాటతోపాటు వేగం ఎక్కువచేశాడు. వినాయకుడు. అలా ఎంతసేపు నాట్యం చేసినా గణపతికి కొంచమైనా అలసట కలగలేదు. అయితే పాట పాడుతున్న వర్తకుడికిమాత్రం ముచ్చెమటలు పోశాయి. అలసిపోయాడు. క్రమంగా వర్తకుడి పాట స్థాయీ తగ్గుతూవచ్చింది. చివరకు ఆగిపోయింది!!—

వర్తకుడి పాట ఆగిందికాని, వినాయకుడి నృత్యం మటుకు మామూలు జోరుతో సాగుతూనే ఉంది.

ఇప్పటివరకు ఘల్ ఘల్‌మంటూ శ్రావ్యంగా వినబడిన గజ్జెలమోత ఆకస్మికంగా ఆగిపోయి, దానికి బదులు 'అయ్యో! అమ్మో !!' అనే మూలుగు వినిపించింది. అంటే, వినాయకుడు కాళ్లకు కట్టుకున్న గజ్జెలమోత ఇలా మూలుగులా మారిపోయిందన్నమాట !—

ఇదేమిటా చిత్రం,— అని అందరూ అటువేపు దీక్షగా చూస్తూవున్నారు. అంతా అలా చూస్తుండగానే గణేశుడి కాళ్ల గజ్జెలు రెండూ రెండు భూతాల రూపంతో బయటపడ్డాయి ! అప్పుడు వర్తకుడికీ ఆ భూతాలకూ హోరాహోరి యుద్ధం జరిగింది. ఆఖరుకు ఆ నగల వర్తకుడుకూడా రాక్షస రూపం దాల్చాడు ! ముగ్గురు రాక్షసులూ కలిసి, వినాయకుడి కాళ్లమీదపడి, 'గణా! గణా !!—' అంటూ ఒకేసారి ప్రాణాలు వదిలారు !—

ఇంతటి చిత్రమైన పథకం వేసిన ఆ నగల వర్తకుడు మరెవరోకాదు. మన మంత్రివర్గం ఎంచి, వినాయకుడి మీదికి పంపించిన భీమాసురుడే !'

—ఈ కథచెప్పి శుక్రాచార్యుడు ఆ నాటికి సెలవు తీసుకున్నాడు.

## 20

సింధురాజు పరిపాలనలో ప్రజ అంతులేని బాధలు అనుభవిస్తున్నారని తెలియవచ్చింది, తండ్రి చక్రపాణికి. తెలియడమేకాదు. ఒకనాడు తనతో బాటు తపస్సుచేసుకునే ముని పుంగవుల్ని సింధురాజు పరివారం యమయాతనలు పెట్టడం కళ్లారా చూశాడు.

''ఏమిటీ మీరు చేస్తున్న పని?—'' అని పరివారాన్ని గద్దించి అడిగాడు.

''రాజాజ్ఞ'' అన్నారు, వాళ్లు.

ఆ! — నా కొడుకు జయసింధు ఇంత మితిమీరిపోయాడా?— వాడి పాలనలోనే ఇంత అరాచకమా ?—'' అంటూ వాపోయాడు.

భార్య ఉగ్రాదేవితోసహా చక్రపాణి వెంటనే తన రాజ్యానికి బయల్దేరాడు.

కొలువుకూటంలో కాలు పెడుతూనే సింధురాజు చేస్తున్న ఘోరాలన్నీ కంటబడ్డాయి, చక్రపాణికి.

మునులనూ, దేవతలనూ నానా బాధలూ పెడుతున్న పరివారాన్ని ''ఆగండి ''— అని ఆజ్ఞాపించాడు, ఆవేశంగా.

సింధురాజువేపు చూశారు, పరివారం.

''దుర్మార్గుడా — ఏమిటీ దురంతం?— ఇందుకేనా రాజ్యం నీకు అప్పజెప్పింది?''— అంటూ ఉగ్రుడయ్యాడు, వృద్ధరాజు.

''నాయనా — ఏమిటీ అరాచకం ? నా కడుపున పుట్టిన నీకేనా ఈ దుర్బుద్ధి?—'' అంటూ వలవల ఏడ్చింది రాజమాత.

సమాధానంగా సింధురాజు ''ఊఁ — వీళ్లనీ ఖైదు చెయ్యండి'' అనిమాత్రం అన్నాడు. అని వెంటనే కొలువుకూటం విడిచిపోయాడు.

నివ్వెరపోయారు వృద్ధ దంపతులు !—

* * *

కైలాసంలో పార్వతీపరమేశ్వరులు ఈ విధంగా ముచ్చటించుకుంటున్నారు :

''నాథా !— మీ భక్తుడు జయసింధు ఇలా లోకకంటకుడయ్యాడే, ఎందుచేతనంటారూ?—'

''ఏమున్నది దేవీ?— నావల్ల వరాలు పొందిన గర్వం. మహా విష్ణువుని, దేవేంద్రుణ్ణీ లోబరచుకున్నానన్న ధైర్యం. అన్నింటినిమించి చుట్టూ చేరివున్న మిత్రుల దుర్బోధవలే అతన్ని పాడుచేశాయి.''

''సాధు బాధవల్ల అతనికి ప్రాణాపాయం ఉందని ఒకప్పుడు మీరు చెప్పారుకదా, మరి అతనికా సంగతి గుర్తు లేదా?—''

''లేకేం?— ఆ మాట గుర్తు లేకపోతే మన గణేశుడ్ని చంపటానికి అంతలా ఎందుకు ప్రయత్నిస్తాడు. నువ్వే చెప్పు !—''

''అయితే మీ భక్తుడి మనసు మారే మార్గమే లేదంటారా?—''

''వరాలంటే ఇచ్చాముకాని, కర్మ తప్పించటం ఎవరి తరం, దేవీ?— అతని కర్మఫలం ఎలా పరిణమిస్తుందో నే చెప్పటమెందుకు, జరగబోయే కథ నువ్వే చూస్తావుగా !—''

* * *

రహస్య మందిరంలో సింధురాజు తనలో తనే ఇలా తర్కించుకుంటున్నాడు :

''అహ్హా హ్హా హ్హా హ్హా — పిచ్చివాడా!— ఎందుకీ భయం? — నిన్నుచూసి నువ్వే జడుసుకుంటావేం? వరప్రసాదివి. పరమశివుడి భక్తుడివి. ముల్లోకాలకూ అధిపతివి. మహా విష్ణువునే ఓడించిన మహా శూరుడివి. అటువంటి నిన్ను— నిన్ను ఎవడో చంపటమా?— ఛా — పట్టిమాట— కల్ల— అబద్ధం . . . . .

''సింధూ !— చేతులారా నువుచేసిన పాపాలూ చేయించిన మహా పాతకాలూ అప్పుడే మరిచిపోయావా ? మహర్షులూ, దేవతలూ వాళ్లవాళ్ల భార్యాబిడ్డలూ గోడుగోడున విలపించినా వినిపించుకోక నానా బాధలూ పెట్టావే. కాస్త గుర్తుకు తెచ్చుకో

''వాళ్లు నావాళ్లను బాధలుపెట్టారు. అందుకే నేనూ వాళ్లను హింసించాను.

''అమాయకుడా !— రాక్షస యువకుల తియ్యతియ్యటి ఆ మాటలే నిన్నీ స్థితికి తెచ్చాయి. ఇప్పుడేనా కళ్లు తెరు—

''గురువు శుక్రాచార్యుడు అబద్ధం చెబుతాడా? ఆయనా నాకు అదేమాట చెప్పాడుగా?—''

''శుక్రాచార్యుడు చెప్పినమాట ఏమిటి?— దేవతలు నీ జాతికి అన్యాయం చేసినమాట వాస్తవం అన్నాడు. అందుకు ప్రతీకారంగా దేవేంద్ర లోకాన్ని వశపరచుకున్నావు. బాగానేవుంది. మరి ఈ సాధుహింస దేనికి?— సాధుహింస చెయ్యమని చెప్పాడా, నీకు గురువు?—

''లేదు''

''హితవు చెప్పటానికి వచ్చిన కన్న తల్లిదండ్రుల్ని ఖైదుచెయ్యమని చెప్పాడా, ఆయన?—''

''లేదు— లేదు''

''చుట్టూ చేరినవాళ్లచెప్పుడు మాటలు విని ప్రాణంమీదికి తెచ్చుకోమన్నాడా నీ గురువు?—''

''లేదు— లేదు— లేదు''.

''అయిందేదో అయింది. మించిపోయింది లేదు. వెళ్లు బందీలనందర్నీ విడుదలచెయ్. మహావిష్ణువును వదిలిపెట్టు. తల్లిదండ్రుల్ని క్షమాపణ వేడుకో— మన్నించమని పరమేశ్వరుడ్ని ప్రార్థించు. గణేశుడ్ని శరణు కోరు—

"చాలు— చాలు— నీ హితబోధ. ఇవన్నీ జరిగే పనులుకావు. ఎన్నటికి జరగవు. ఇంతవరకు పౌరుషంతో బతికాను. ఇప్పుడు శత్రువును శరణు వేడితే లోకం ఏమంటుంది?— 'ఛీ— పిరికిపందా!' అని చీదరించుకోదూ?— పౌరుషంగల జాతిలో పుట్టాను. అజేయుడుగా వరాలుపొందాను. శరణు అన్నమాట నా జీవితంలో లేదు. జరిగే పనికాదు. హ్హా హ్హా హ్హా హ— రానీ— రానీ— నన్ను చంపగల వాడెవడో రానీ—వాడి పని నేనూ చూస్తా. వీడెవడో కాదు— హ్హా — జయసింధు! — హ్హా హ్హా హ్హా జయసింధు!—హ్హా హ్హా హ్హా హ జయసింధు !! — హ హ్హా హ్హా హ్హా హ !—"

## 21

అసుర గురువు కథ చెప్పటం ప్రారంభించాడు. సింధురాజు ఆలకిస్తున్నాడు.

'విన్నావుగా అక్కా !— లోకం వేసిన అపవాదు? మా అందరికంటే పెద్దదానివి. నువ్వే మాకు శరణ్యం. ఇప్పుడు వచ్చిపడిన అపవాదు పోగొట్టి, మళ్లీ మా కాపరాలు నిలబెట్టే భారం నీదే !'. అంటూ, ఋషి పత్నులు ఆరుగురూ కలిసి అరుంధతీదేవిని వేడుకున్నారు.

దూరం యోచించింది, అరుంధతి.

"చెల్లాయిలూ !— మీకు వచ్చిన భయమేమీలేదు. కలవరపడకండి. ఈ నీలాపనిందలు

# కార్యసిద్ధి

ఎంత పనైనా చేస్తాయి. ఇవాళ వినాలయ్యారు, రేపు నేసవుతాను. వీటికొక తలాతోక ఏమిటి? ముక్కూ మూలమూ ఏమిటి? ఈ గొడవ అసలు ఎలా వచ్చిందో కారణం కనుక్కోనే తీరాలి. ఇంతకూ ఒక్కమాట! పతివ్రతలను ఉసురుపెట్టిన పాపం పూరికేపోదు, నా మాట నమ్మండి.

"ఇప్పుడు మనమంతా పోయి, ఆ బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సుచేద్దాం, రండి !— ముందీ అపవాదు పోవాలి, అప్పుడు మనం ఇళ్లకు మళ్లాలి ! అంత వరకూ తిరిగి రానేవద్దు. ఇలా దీక్షపడితేగాని, మనకు పట్టిన ఈ కళంకం పోదు.

"ఉండండి — మా వారిని సెలవడిగి క్షణంలో వచ్చేస్తా"— అనిచెప్పి, భర్త అనుమతికోసం అరుంధతి ఆశ్రమంలోపలికి వెళ్లింది.

పతి అనుజ్ఞపొంది అరుంధతి రాగానే ఋషి పత్నులందరూ ఆమెతో కలిసి, నదీతీరానికి చేరుకున్నారు. నదిలో చక్కగా స్నానంచేసి, పవిత్రంగా బ్రహ్మనుగూర్చి తపస్సు ప్రారంభించారు.

* * *

"రోజు కొకరు చొప్పున వంతులు వేసుకుని అడవిలో అగ్నిదేవునితో సరసాలాడుతున్నారట ! ఇది కళ్లారా చూశారట !— ఏం చోద్యం, ఏం చోద్యం !" అని లోకం కోడై కూసింది !—

"ఎవళ్లో ఏమో, మామూలు మనుషులైతే పట్టించుకోవలసిన పనేలేదు. ముల్లోకాలనూ నడిపించే మహర్షుల భార్యలే— మహా పవిత్రులైన ఋషిపత్నులే ఇలా నడుచు కున్నారంటే విడ్డూరం కాదూ? ఇది విని ఎవళ్లూరుకోగలరు? ఎలా నూరుకోగలరు ?—"

ఈ వదంతి లోకంలో ఇట్టే వ్యాపించింది. ప్రజ లోలోపల గొణుక్కోసాగారు. మరి కొండ్రు రోజులకల్లా నీలాటి రేవుల దగ్గర, గ్రామ చావడుల దగ్గర ఎక్కడ విన్నా ఇవే గుస గుసలు ! ఇవే గుస గుసలు !

ఇదెంతవరకూ పోయిందంటే— నాలుగోరోజు నుంచీ చదువుకునే కుర్రవాళ్లను తలిదండ్రులు గురుకులాలకు పంపించడం మానేశారు. ఇలా కట్టు కట్టడానికిగల కారణం ఏమిటా అని మహర్షులు మొదట తబ్బిబ్బుపడ్డారు. తరవాత నోరు తెరచి అడిగారు. అయితే, విప్పి చెప్పటానికి మొఖమాట పడ్డారు పెద్దలు. కొంతమంది తెగించి చెప్పేశారు.

"వద్దు బాబూ! మా పిల్లలకు చదువులూ వద్దు, చట్టుబండలూ వద్దు. మమ్మల్నికూడా వీధిలోకీడవకండి! మా సంసారాలు ఈ మాత్రమైనా సుష్టుగా ఉండనివ్వండి?" అంటూ, నిష్కర్షగా బదులు చెప్పారు.

అరుంధతి భర్త వశిష్ఠుడుతప్ప, తక్కిన ఋషులు ఆరుగురూ ఈ మాటకు ముక్కుమీద వేలేసుకున్నారు. లోకంలో అల్లుకునివున్న అపవాదు గ్రహించారు. భార్యలను పిలిచారు. 'బయటికి నడవండి !' అని ఆజ్ఞాపించి, అవతలికి వెళ్లగొట్టారు.

ఇంకేముంది !—

పండువంటి ఆరు కాపరాలకూ ఒక్కసారిగా చిచ్చు పుట్టిందాయె !— ఆరని చిచ్చు !! దీంతో ఋషిపత్నులు ఆరుగురూ అరుంధతీదేవి బసకు చేరుకున్నారు.

* * *

ఆనాటి రాత్రి—

మహర్షు లారుగురికీ బ్రహ్మదేవుడు కలలో కనిపించాడు, ఇలా చెప్పాడు :

"మహానుభావుల్లారా !— మీరు లోకకల్యాణ మూర్తులు. మీరు ఆగ్రహిస్తే లోకాలే నిలబడవు. మీ పత్నులవల్ల వచ్చిన తప్పేమీ లేదు. ఎంతమాత్రం లేదు. అది కేవలమూ ఉత్త పుణ్యానికి పుట్టిన వదంతి. అయినా, అగ్గి లేందీ, పొగ రాదంటారు. కనుక, ఈ వదంతి అస లెందుకు పుట్టిందో, ఆ రహస్యము ఇప్పుడు మీకు వెల్లడిస్తున్నా, వినండి :

అగ్నిదేవుడి భార్య అయిన స్వాహాదేవి తన భర్త కోరిక తీర్చడం కోసమని మీమీ పత్నుల రూపాలు ధరించింది. అదే ఈ కలవరమంతటికీ కారణం. అంతకంటె మరేమీ లేదు. కనుక, మీ రెంతమాత్రం అపోహ పడవలసిన పనిలేదు.

అయితే—ఈ అపవాదు పుట్టడానికి కారణముంది. అదేమిటంటే, పార్వతీదేవివల్ల శాపం పొందిన చందమామను, వినాయకచవితినాడు మీ పత్నులు చూశారు. ఇందువల్లనే నీలాపనిందలు. అంతే తప్ప, మీ పత్నులవల్ల ఎటువంటి లోపమూ లేదు. కనుక, నిస్సంశయంగా మీ సతీమణుల్ని మీరు స్వీకరించి, ఏలుకోండి !" అంటూ నమ్మబలికాడు !

ఋషులు మళ్లీ ఇలా ఎదురుప్రశ్న వేశారు :



"బ్రహ్మదేవా! మీ ఉద్దేశం బాగానే ఉంది. మీ సలహాను మేమైతే ఒప్పుకుంటాం. కాని, లోకుల నోళ్ళు మూయ్యటం ఎలా సాధ్యమవుతుంది ?"

అందుకు బ్రహ్మదేవుడు—"మీరీ ప్రశ్న వేస్తారని నాకు తెలుసు. ఒక పని చెయ్యండి. రేపు తెల్లవారు జామునే మీరూ, మీ పత్నులూ స్నానంచేసి, నిండు మనస్సుతో వినాయక పూజ చేసి, శమంతకమణి కథ చెప్పుకుని, ఆ వెంటనే ఇప్పుడు జరిగిన మీ పత్నుల కథ కూడా చెప్పుకోండి. కథాక్షతలు వేసు కోండి. తరువాత జరగాల్సిన తతంగమంతా ఆ విఘ్నేశ్వరుడే నడిపిస్తాడు !" అని సలహాచెప్పి, అంతర్ధానమయ్యాడు !

* * *

ఋషులకేకాని, వారి పత్నులకు బ్రహ్మదేవుడు ప్రత్యక్షం కాలేదు. అయితే, అగ్నిదేవుడి భార్య స్వాహాదేవి మాటుకు ఋషిపత్నులకు దర్శన మిచ్చింది.

"తల్లుల్లారా !—సాటి ఆడదాన్ని, నే నెటువంటి విషమ పరిస్థితుల్లో చిక్కుకున్నానో నా కథ కాస్తంత వినాలి—మీ భర్తలంతా కలిసి యజ్ఞం చేసినప్పట్నుంచీ నా నాథుడు తీరని మనోవేదనతో బాధపడ సాగాడు. ఈ వేదనకు కారణ మేమిటో కను క్కుందామంటే నావల్ల కాలేదు.

నిద్రావస్థలో మీమీ పవిత్రనామాలు స్మరిస్తాడు. పగటిపూటల్లా విరహతాపంతో అడవులకు పోయి కాలక్షేపం చేస్తుంటాడు. ఓహో, ఇదా సంగతి అని కనిపెట్టా. నానాథుడి బాధ పోగొట్టడానికి నా అంతట నేనే సాహసించి ఒక ఉపాయం చేశా.

చేసిన పాపం చెబితే పోతుందంటారు. పెద్దలు. కనుక నే చేసిన పాపం చెప్పేస్తా—నా భర్త మనస్సు ఋషిపత్నులమీద పడింది అనే సంగతి నిశ్చయ మయిపోయింది. అందుకని ఒక్కొక్కనాడు మీలో ఒక్కొక్కరి రూపు ధరించి, నాపతి యెదుట శవ బడుతూ వచ్చాను. ఆయన అపరిమితానందం పొందారు !

అయితే—

మీ ఆరుగురి రూపాలూ సులువుగా ధరించాను కాని, తల్లీ !—అరుంధతీ !!—నీ రూపు ధరించాలని ఎన్నోరోజున విశ్వప్రయత్నం చేశాను. నీ ప్రభావం ఏమిటోగాని, ఆపని మాత్రం నావల్ల కాలేదు, దేవీ! —పైగా, నే చేసిన ఈ పాపకార్యంవల్ల నానాథుడు ఇప్పుడు భరించలేని కడుపునొప్పితో గిలగిల్లాడి పోతున్నాడు !

ఇదీ, నావల్ల జరిగిన అపరాధం. మీరంతా నన్ను క్షమించాలి. నా పతిని రక్షించాలి !" అంటూ ఎంతో వేడుకుంది.

అప్పుడు అరుంధతి స్వాహాదేవిని సానుభూతితో ఆదరించి, "అమ్మా!— నిష్కళంకమైన పతి భక్తిలో నిన్ను మించినవారు లేరు. నీ భర్త కోరిక తీర్చటమే నీ విధి. అందుకోసం నువు చేసిన పని ఎంతో సమంజసమైంది. నీవల్ల ఎలాటి తప్పీ జరగా లేదని నాకు తెలుసు. కాని, మంచికోసమని నువు చేసిన పని నా చెల్లెళ్ళయిన వీళ్ళపట్ల మరొక విధంగా పరిణమించింది. వీళ్ళని అనవసరంగా అప నిందలపాలు చేసింది. ఇదే నా దుఃఖం.

అయితే—ఇదంతా నిమిత్తమాత్రంగా జరగ వలసే ఇలా జరిగింది. నీ విచారమూ, మా విచారమూ తొలగిపోయే మంచిరోజు రాకపోదు. నా చెల్లెళ్ళకు వచ్చిన అపవాదును పోగొట్టగలవాడే నీ నాథుణ్ణి రక్షిస్తాడు. ఆ శుభసమయం కోసం ఆతురతతో వేచి ఉందాం !" అని చెప్పి ఆమెను ఓదార్చింది.

* * *

ఆనాటి రాత్రి వూళ్ళో ఒక చిత్రం జరిగింది :

గ్రామ పెద్ద కలగన్నాడు ! ఏమిటా కల ?—అతడి భార్య వెళ్ళి, అడవిలో ఉన్న అగ్నిదేవుడితో సరసాలాడుతూందిట !!—ఛ!—పాడు కల !!' అని చెప్పి గ్రామాధికారి కళ్ళు నులుముకు చూశాడు. భార్య కనబడలేదు. పిలిచాడు, పలకలే. ఇల్లంతా వెతికాడు, పెరడంతా గాలించాడు. ఉహూఁ !—పత్తాయే లేదు !—

ఇది పనికాదని సిగ్గువిడిచి, పక్కింటికి పోయి చూశాడు. చూస్తే ?—పక్కింటాయన ఇలాగే పెళ్ళాం కోసం వెతుక్కుంటున్నాడు!— వీళ్ళిద్దరే కాదు. వూళ్ళో యావన్మంది పురుషులూ ఇదే అవమానంతో తల్లడిల్లిపోతున్నారు ఆ!!!—

అందరికీ ఉమ్మడిగా ఒకే బాధ పట్టుకుంది కాబట్టి, పెద్దలంతా ఒకచోట కూడారు. ఒకరి కొకరు కూడబలుక్కుంటే, తేలిన సంగతి ఇదీ—నాటి రాత్రి వాళ్ళందరకూ ఇదే కల వచ్చిందిట ! అందరూ ఆత్రంతో భార్యలకోసం వెతుక్కుంటున్న వాళ్ళే —ఎంత విడ్డూరం ! ఎంత విడ్డూరం !!

అందులో కాస్త తెలివైనవాడు నిదానించి ఇలా చెప్పాడు :

'జ్ఞాపకంలేదా, మనం మహర్షుల్ని నానా మాటలూ అన్నాం. మనం కట్టుకట్టి మన పిల్లల్ని గురుకులాలకు పంపడం మానివేశాం. నోటికి వచ్చినట్టల్లా మాటాడితే వాళ్ళ దోసం వూరికే పోతుందా ? కట్టి కుడుపుతుంది!— అసలే మహర్షులకు ముక్కుమీద ఉంటుంది కోపం. కనుక సప్తమహాఋషుల్లోనూ ఎవరో ఒకాయన మనల్ని శపించి ఉంటాడు. రండి, రండి— పోయి వాళ్ళ కాళ్ళు పట్టుకుందాం !' అంటూ అందర్ని తొందర పెట్టాడు.

'అవునవును !' అంటూ, అంత అతని వెంట ఋష్యాశ్రమాలవేపు పోయారు.

* * *

అప్పటికే సప్తమహాఋషులూ, వారి సతీమణులూ పీటలమీద కూచుని అత్యంత వైభవంగా వినాయకపూజ ముగించారు. వశిష్ఠుడు కథ చెప్పాడు.

శమంతకమణి కథ చెప్పి, ఆ తరవాత ఇంత వరకూ జరిగిన ఋషి పత్నుల కథ చెప్పగానే, అక్కడ చేరుకున్న గ్రామస్థులంతా 'అయ్యో, ఎంతపని ! ఎంతపని !! మహా పతివ్రతల్ని గురించి అడ్డమైన కారుకూతలూ కూశామే ! ....' అంటూ విచా రించారు.

'స్వామీ !—మేం అజ్ఞానులం. మా తప్పులు క్షమించండి. మా భార్యలు మళ్ళీ మాకు దక్కే టట్టు అనుగ్రహించండి !' అని చెప్పి, మహర్షుల్ని ప్రార్థించారు.

అందుకు మహర్షులు, 'మేం కాదు అనుగ్ర హించవలసింది, అదుగో ఆయన—ఆది దేవుడైన ఆ వినాయకుడికి మొక్కుకోండి !' అని గణేశుడి విగ్రహంవేపు చూపించారు.

అప్పుడందరూ భక్తితో వినయుని, ఏకదంతుణ్ణి ఏకకంఠంతో స్తుతించారు :

మూషిక వాహన నమో నమో
మునిజన వందిత నమో నమో
పార్వతి తనయా నమో నమో
పావన చరితా నమో నమో
పశుపతి నందన నమో నమో
భవ్య వినాయక నమో నమో

గ్రామస్థులంతా వినాయకుణ్ణిలా కీర్తిస్తూ భజన చేస్తూ ఉండగానే, వాళ్ళవాళ్ళ ఇళ్ళల్లో ఒక్కొక్కళ్ళే, ఎవడి భార్య వాడి పక్కన వచ్చి చేరుతున్నారు ! ఆ భర్తల సంతోషం ఏమని చెప్పగలం ?

—ఈ కథ చెప్పిన శుక్రాచార్యుణ్ణి సింధురాజు ఇలా అడిగాడు :

'గురూత్తమా ! మీ సమక్షమందే కదా మా అనుమతి తీసుకుని, సంపలుడనే మహావీరుడు గణ పతి మీదికి దాడి వెళ్ళింది ? అటునించి తిరిగి వచ్చి నట్టు లేదే ? ఆ భోగట్టా ఏమైనా మీకు తెలిసిందా ?'

'రాజా ! సరిగ్గా నేనూ ఆ విషయమే తెలుదామను కుంటున్నా. నువ్వా అడిగావు చెప్తా తర్వాత :

(ఇంకావుంది)





'బభ్రువాహన'లో యల్. విజయలక్ష్మి

# సినిమా వార్తలు

## అశోక్ మూవీస్ "సుమంగళి"

అశోక్ మూవీస్‌వారి "సుమంగళి" తాజా సాంఘిక చిత్రానికి జూలై నెల షెడ్యూలులో 11 రీళ్లు చిత్రం పూర్తి అయింది. ఈనెల 25 నుండి సెప్టెంబరు 10 వరకు ఉన్న షెడ్యూల్ ప్రకారం షూటింగ్ జరిగితే చిత్రం పూర్తి అవుతుంది. సెప్టెంబరులో విడుదల చేయాలని నిర్మాతలు గోవిందరాజన్, అసోసియేట్ ప్రొడ్యూసర్ శ్రీ శాస్త్రిల అభిప్రాయమని తెలుస్తుంది. కొన్ని పాటలను హైదరాబాద్ పబ్లిక్ గార్డెన్స్‌లో చిత్రీకరించారు. ఈసారి జరుగబోయే షూటింగులో మద్రాసు సమీపంలో మహాబలిపురం, రెడ్‌హిల్స్ ప్రాంతాల్లో ఔట్‌డోరు చిత్రీకరణ చేస్తారు.

ఈ చిత్రానికి మాటలు, పాటలు : ఆచార్య ఆత్రేయ, సంగీతం : కె. వి. మహదేవన్, నాగేశ్వరరావు, సావిత్రి, జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, జి. వరలక్ష్మి, గిరిజ, నాగయ్య, నాసంతి మొదలగువారు నటిస్తున్నారు.

*   *   *

శ్రీ శ్రీకాంత్ వ్రాసిన మరాఠీకథ మూలాధారంగా ప్రసాద్ ప్రొడక్షన్స్‌వారు నిర్మించనున్న సాంఘిక చిత్రానికి ఫిలిం ఎడిటర్ శ్రీ సంజీవిరావు దర్శకత్వం చేస్తారు. ఈ చిత్రానికి రచన : ముళ్ళపూడి వెంకటరమణ, సంగీతం : కె. వి. మహదేవన్.

## అనుపమావారి "ఉయ్యాల జంపాల"

అనుపమావారు తమ తాజా సాంఘికచిత్రం ఔట్‌డోర్ షూటింగ్‌కు గోదావరిలో లంచి మీద, లక్ష్మీశ్వరపురం, వస్సాపురం, మొదలగు చోట్ల కొబ్బరి తోటలలోను, ఆయా ప్రాంతాలలోని సహజసిద్ధమైన సౌందర్య ప్రకృతి శోభతో కూడిన ప్రాంతాలలో కొన్ని దృశ్యాలను, రెండు పాటలను చిత్రీకరించారు. అట్లతద్దిపాట చిత్రీకరణకు అక్కడ రాజుల కుటుంబంలోనివారు ముందంజవేసి సహకరించి, చిత్రీకరణలో పాల్గొన్నట్లు, నిర్మాత, దర్శకుడు అయిన శ్రీ తిలక్ తెలియజేశారు.

ఔట్‌డోర్ షూటింగ్‌లో జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, చలం, రమణారెడ్డి, కె. వి. ఎస్. శర్మ, వదలవాడ, కృష్ణకుమారి, వాసంతి, మీనాకుమారి, లక్ష్మీకాంతమ్మ మొదలగువారు పాల్గొన్నారు. ఔట్‌డోర్ షూటింగ్‌లో ఛాయా దర్శకుడు శ్రీ చౌదరి ప్రత్యేక శ్రద్ధ వహించినట్లు తెలుస్తుంది. రచయిత పినిసెట్టి శ్రీరామమూర్తి, నృత్య దర్శకుడు వెంపటి సత్యం, కూడా ఉన్నారు. సుమారు 20 రోజులు ఔట్‌డోర్ షూటింగ్ జరిగింది. వీనస్ స్టూడియోలో ప్రస్తుతం చురుకుగానే షూటింగ్ జరుగుతుంది.

ఈ చిత్రానికి సంగీతం— పెండ్యాల నాగేశ్వరరావు.

## రేఖా అండ్ మురళీ ఆర్ట్సు

వీరి ప్రథమ చిత్రంలో ఎన్. టి. రామారావు, పద్మనాభం, సావిత్రి (ద్విపాత్రాభినయం), గీతాంజలి మొదలగువారు నటిస్తారు. ఛాయ—ఎం. జి. సింగ్, కళ—బి. ఎన్. కృష్ణ, కూర్పు—గోపాలరావు, నిర్మాత—పద్మనాభం, దర్శకుడు—కె. హేమాంబరధరరావు.



'డా॥ చక్రవర్తి'లో సావిత్రి, జగ్గయ్య

## "దొంగలు - దొరలు"

శ్రీ దేవి పిక్చర్స్‌వారు నిర్మించిన "విచిత్ర వ్యక్తులు" అనే సాంఘిక చిత్రానికి పేరు మార్చి "దొంగలు — దొరలు" అని నిశ్చయించారు. ఈ చిత్రంలో శివాజీ గణేశన్ మూడు విభిన్నపాత్రలు, యం. ఆర్. రాధా రెండు విభిన్న పాత్రలు పోషించారు. ఇంకా ఈ చిత్రంలో దేవిక, వాసంతి, సంధ్య, మొదలగువారు నటించారు. ఈ చిత్రానికి మాటలు — పాటలు : రాజశ్రీ. ఈ చిత్రాన్ని ఆగష్టు రెండవ వారంలో విశాలాంధ్రఅంతటా విడుదల చేయనున్నారు.

## ఆర్. ఆర్. పిక్చర్సు ప్రొడక్షన్ నెం. 12

అదొక పెద్ద భవంతి. అందులో ఒక హాలు. కైలాసం (రమణారెడ్డి) విచారంగా ఉంటాడు. ప్రక్కనే ఉన్న కొడుకు శేషు (రాజనాల) ను పురోహితులు ఓదారుస్తున్నారు. కైలాసంగారిక్కి వస్తున్న పీడ కలలకు గ్రహ శాంతి చేయిస్తే మంచిదని పురోహితులు చెప్తున్నారు. ఇంతలో అక్కడకు ఆ ఇంటి కోడలు గంగ (వాసంతి) వచ్చి —

"ఏమండీ! పెళ్లివారింకా రాలేదేమండీ?" అని అడుగుతుంది.

దానికి సమాధానంగా భర్త శేషు "అలాగని నువ్వు వంట చేయ్యలేదాయేం?" అని అడుగుతాడు.

వంట ఏర్పాట్లన్నీ ప్రొద్దుటే అయినాయని గంగ తెలుపుతుంది. ఆ సమయానికే బయటనుంచి డ్రైవర్ (ప్రసాద్) గబాగబా వచ్చి —

"అయ్యగారూ! పెళ్లోరొచ్చేశారు" అంటాడు.

కైలాసం కొడుకు శేషుతో సహా ఆహ్వానించ డానికి వెడుతూ ప్రక్కనున్న పురోహితునితో "శాస్త్రుల్లుగారూ! నువ్వు ఎదురు పోబోక— కాస్త ప్రక్కగా నిలబడు" అని చెప్పి, అప్పటకు వచ్చిన పెండ్లి కొడుకును (యన్.టి. రామారావు), వానితో వచ్చినతనిని (పద్మనాభం) కూడా ఆహ్వానించి, కూర్చోబెడతారు. పెండ్లికుమారుని వేష ధారణ చూస్తూంటే, పెద్ద ధనికుని కుమారునిలా కనిపిస్తున్నాడు.

అంతా కుశల ప్రశ్నలయిన తరువాత, పెండ్లి కుమార్తె తండ్రి కైలాసం—

"అమ్మా! నాన్నా! ఎవరూ రాలేదేమండీ?" అని అడుగుతాడు. అందుకు పెండ్లి కుమారుడు, సురేష్ పెర్సనల్ సెక్రటరీ తను అని చెప్పుకున్న "వాలి" — ఎందుకూ? పెళ్లాడేది వారు—ఇష్టపడ్డారు. వచ్చేశారు" అంటాడు.

అందుకు కైలాసం. "ఆస్థిపాస్తులు ఉంటాయి చూశారూ"..... ఆ పైన వాలి "టెలిఫోనుగాని, టెలిగ్రాం గాని ఇస్తే, తమ అకౌంటెంటు పరుగెత్తుకుని వచ్చి తమకు డబ్బు ఎంత అవుతుందో చెప్పుకుంటాడు. "మాకు ఉన్న డబ్బు మాకేం జ్ఞాపకం?" అని చెప్తాడు.

దానికి అంతా అంటే పెండ్లికుమారుని అంత స్థకు సంతోషిస్తారు. ఇంతలో శేషు—

"కాస్త పెండ్లి కుమారుని మాట్లాడమనండి!" అంటాడు. దానిమీద సురేష్ కోసం నటిస్తూ "ఏమిటి? మీరేదో గొడ్డుకు పళ్ళూ, సుళూ చూసినట్లు చిలిపి ప్రశ్నలు వేస్తున్నారు!... ఇష్టమైతే పిల్లనివ్వండి. కష్టమైతే మానెయ్యండి అంతే! సెక్రటరీ! కమాన్. టాటా! అంటూ వెళ్ళబోతాడు.

శాస్త్రులు అడ్డుపడి "కాబోయే అల్లుడుగారు గనక కాస్త సరసం ఆడారు" అంటాడు.

పై సన్నివేశం ఆర్.ఆర్. పిక్చర్సువారి ప్రొడక్షన్ నెం. 12 తెలుగు తాజా హాస్యచిత్రంలోనిది. ఈ చిత్రానికి త్వరలోనే నామకరణం చేసి ఆగష్టు నెలాఖరుకు విడుదల చేయనున్నట్లు తెలుస్తుంది. ఇంత వరకు 11 రీళ్ళ చిత్రం పూర్తి అయింది. ఈ చిత్రంలో యన్. టి. రామారావు, కృష్ణకుమారి, రమణా రెడ్డి, రాజనాల, పద్మనాభం, ప్రసాద్, జగ్గారావు, గీతాంజలి, వాసంతి, సంధ్య మొదలగువారు



"గౌరి ప్రొడక్షన్ 'నెం. 3'" లో వాణిశ్రీ, రాజశ్రీ





అప్పంతలోనే మంచి హాస్యాన్ని అందించే అల్లు రామలింగయ్య 'మూగమనసులు'లో అప్పన్నగా అగుపించాడు 'దాగుడు మూతల'లో గౌరయ్యశాస్త్రిగా అగుపించనున్నాడు.



అనుపమావారి "ఉయ్యాల—జంపాల" ఔట్‌డోర్ షూటింగ్ నర్సాపురం దగ్గర గోదావరి ఒడ్డున జరిగింది. ఈ చిత్రంలో దర్శకుడు—తిలక్, జగ్గయ్య, వాసంతి లను చూడవచ్చును.

# సినిమా వార్తలు

నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు—పాటలు— ఆచార్య ఆత్రేయ, సంగీతం—పెండ్యాల నాగేశ్వరరావు, ఛాయ —మల్లియరావు, కథ— సెల్వరాజ్, కూర్పు— ఎం. ఎస్. మణి, సహాయ దర్శకులు— కె. దుర్గా నాగేశ్వరరావు అండ్ కుమార్, దర్శకుడు— ఐ. ఎన్. మూర్తి, నిర్మాత—ఆర్. ఆర్. పిక్చర్సు తరఫున టి. ఆర్. చక్రవర్తి.

## రిపబ్లిక్ ప్రొడక్షన్సు "బొబ్బిలి యుద్ధం"

ఈ మధ్య రిపబ్లిక్ ప్రొడక్షన్సు వారు నిర్మిస్తున్న చారిత్రాత్మక చిత్రం "బొబ్బిలి యుద్ధం" నకు సంబంధించిన ఒక పాటను ఒక పద్యంను భరణీ స్టుడియోలో రికార్డ్ చేశారు.

సుప్రసిద్ధ సంగీత దర్శకుడు యస్. రాజేశ్వరరావు పాడగా పాటను రికార్డ్ చేశారు. చిత్రం ప్రారంభంలో గొల్లవాడు పాలు పిదుకుతూ ఆ పాట పాడుతూంటాడు. ఈ చిత్రానికి సంగీత దర్శకుడు కూడ శ్రీ రాజేశ్వరరావే. మాధవపెద్ది సత్యం పద్యంను చదువగా రికార్డ్ చేశారు. ఈ పద్యాన్ని యస్. వి. రంగారావుతో చిత్రీకరిస్తారు.

ఉద్యానవనంలో వెంగళరాయుడు, సుభద్ర ఊయల మీద కూర్చొని ఉంటారు. వెంగళ రాయుడు తదేకంగా ఆమె ముఖాన్ని చూస్తూ:...

"దేవి నేనెంతో అదృష్టవంతుణ్ణి. అటు నా అన్నగారు నన్ను కంటికి రెప్పలా కాచుకుంటారు. ఇటు నా కోరిక ఫలించి, నా కంటి దీపమై నా ఇంట వెలుగుతున్నావు— నీ చూపుల వెన్నెల జల్లు, నెరిమోముని మాధుర్యము..

"మీకు కత్తి తిప్పడమే వచ్చుననుకున్నాను. కవిత్వం కూడ వచ్చునే"—"

"రాకేం చేస్తుంది! ఒక అమ్మాయిగారి తామర పువ్వులాంటి కళ్ళు, నిగ్గుటద్దాలవంటి చెక్కిళ్ళు కంట పడితే— కవిత్వం—గానం, శిల్పం, చిత్రలేఖనం ఒక దాని వెంట ఒకటి అల్లిబిల్లిగా అల్లుకొని ఉక్కిరి బిక్కిరి చేస్తాయి".

"ఆహా! అబ్బాయిగారు ఉన్నట్టుండి ఒక్కసారే కళాప్రపూర్ణులై పోయారే!"

"అంతా ఆ అమ్మాయి వేసిన మంత్రం— కోడి కోసం గోడదూకితే— గుమ్మంలో ఎదురై అది, కదలకుండా గారడీ చేసింది. కళ్యాణం చేసుకొని కట్టి పడేసింది".

"పాపం! ఎంత పని చేసింది!... మీదే అమాయకులు. ఎవరైనా వింటే నవ్విపోతారు."

"పలుకులు నేర్చిన చిలుకకు పుట్టెడు బోనా! నీ అనురాగ సుధారసం గ్రోలి వెయ్యేళ్ళు బ్రతకాలని ఉంది."

"ధన్యురాలను ప్రభూ."

ఈ సన్నివేశం "బొబ్బిలి యుద్ధం" చిత్రంలోనిదే. వెంగళరాయుడుగా సి. సీతారాం, సుభద్రగా జమున నటించారు. ఈ చిత్రానికి దర్శకుడు—నిర్మాత— సి. సీతారాం.

—సి. ధర్మారావు. ☆

గత సంచికలో ప్రచురించిన 'వరలక్ష్మీ వ్రతం' వ్యాసరచనకి శ్రీ ఎస్. రామకృష్ణ పంపిన ఫోటోలు శ్రీమతి ఎస్. రాజమ్మ పంపిన వ్యాసం ఉపయోగపడ్డాయి. సం॥

Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'దైవనిర్ణయం' లో కృష్ణకుమారి




రా జ శ్రీ

నిగనిగలాడు నల్లని కేశములకు

# రెమి

కేస్టర్ హేర్ ఆయిల్

CRITERION RP. 411